


జాతికి జీవనాడి వంటి మన పల్లెలు ప్రణాళికల ఫలితంగా ఇప్పుడు ఎలా వెలిగిపోతున్నాయి? ఓ మారుమూల పల్లెలో తప్పనిసరై పంతులమ్మగా ప్రవేశించిన బడుగువర్గపు యువతికి అక్కడ ఎదురైన మర్యాదలు ఎలాంటివి? ఊళ్ళోకి 'లేడి' అడుగు పెడితే ఆహ్వానించేది వేటగాళ్ళు, తోడేళ్ళు మాత్రమేనా? వాటిని కాదని మనగల శక్తి ఎవరికీ లేదా?... వీటికి సమాధానం 'చతుర' సెప్టెంబర్ సంచికలో ఉత్కంఠతో చదివించే కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి నవల

# పల్లె

నాలుగు రంగుల ఆఫ్ సెట్ ముద్రణతో కంటికి, మనసుకు విందు చేసే నవ నవలా వేదిక చతుర. **132** పేజీల పత్రికలో నెల నెలా ఒక సమగ్ర నవలను అతి తక్కువ ధరకు తెలుగు పాఠకులకు అంద జేసే ఏకైక పత్రిక 'చతుర'. నవలతో పాటు అదనంగా అమృత 'చతుర ప్రపంచం'లో విహరింపజేసే 'చతుర మినీ కథలు'తో ఆహ్లాద పరుస్తుంది చతుర.

ప్రతినెలా
1వ తేదీకి వెలువడే
చతుర నవలా స్రవంతి

# చతుర

రెండు రూపాయిలే!



# ది సౌత్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మైనింగ్ అండ్ మైన్ సర్వేయింగ్

రాజవీధి, ఫోన్స్: 587 & 354. గూడూరు (నెల్లూరు జిల్లా)

విద్యార్హతలు గలిగి పాలిటెక్నిక్ ఆదితర సాంకేతిక సంస్థలలో ప్రవేశార్హత లేని యువకులకు సదవకాశం!!
ఈ క్రింది కోర్సులలో పాస్ అయిన యెడల మీకు నిరుద్యోగ సమస్యలేదు.

**2వ బ్యాచ్ ప్రారంభం.**

అర్హులైన అభ్యర్థుల నుండి ఈ క్రింది కోర్సులలో ప్రవేశమునకు దరఖాస్తులు 10—9—81 లోగా కోరబడుచున్నవి.

| నెం. | కోర్సు వివరము | కోర్సు కాలపరిమితి | కనీస విద్యార్హత | వయోపరిమితి |
|---|---|---|---|---|
| 1. | మైన్ సర్వేయర్ సర్టిఫికెట్ ఆఫ్ కాంపిటెన్సీ | 2 సం. | ఎస్. ఎస్. సి. లేక కనీస విద్యార్హత | 18 సం. |
| 2. | సెకండ్ క్లాస్ మైన్ మేనేజర్స్ సర్టిఫికేట్ ఆఫ్ కాంపిటెన్సీ | 2 సం. | డిప్లొమా ఇన్ మైనింగ్ లేక ఫోర్‌మెన్ సర్టిఫికేట్ | 18 సం. |
| 3. | ఫోర్‌మెన్ సర్టిఫికేట్ ఆఫ్ కాంపిటెన్సీ | 2 సం. | ఎస్. ఎస్. సి. | 18 సం. |
| 4. | మైన్ మేట్ సర్టిఫికేట్ ఆఫ్ కాంపిటెన్సీ | 2 సం. | ఎస్. ఎస్. సి. | 18 సం. |

పైన కనబరచిన 1, 2, 3 కోర్సులకు పోస్టలు కోచింగ్ సౌకర్యములు కూడ గలదు.
దరఖాస్తు ఫారము మరియు ప్రాస్పెక్టసు కొరకు రూ. 5 ఎం. ఓ. చేయుండి.
N. B.: అనుభవజ్ఞులైన లెక్చరర్లు, ఇంజనీర్లచే నడుపబడుచున్న ఏకైక సంస్థ.

డైరెక్టరు,
G. Hari Krishna Prasad.

Jhansi

---

**ముత్యములవలె మెరిసే పళ్ళకోసం**
**పువ్వులవలె నురగవచ్చు......**

**ఫ్యామిలి టూత్ పౌడర్**









తయారుచేయువారు:
**శ్రీరామ ఇండస్ట్రీస్. గుంటూరు-1**

స్టాకిస్టులు కావలెను

ESWAR SNT

తిరిగి వాడుకొనుటకు ఆకర్షణీయమైన కన్‌టైనరు.

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

వ్యవస్థాపకులు.
**దేశోద్ధారక కాశీనాధుని**
**నాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 – 1972]
శుక్రవారం : 11-9 '81
దుర్మతి నామ సం. భాద్రపద శు. ద్వాదశి
**సంపుటము 75. సంచిక 1**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 67-60
ఆరు మాసాల చందా రు. 33-80
విడిప్రతి వెల రు. 1-50 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
**గాంధీనగరం, విజయవాడ-520 003**

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
విఘ్నేశ్వరుడు
(చిత్రం: గీతా)

**కథలు :**
విధివాలసుఖమా ?
(పెద్దకథ ప్రారంభం!) ... 8
రామ్మూర్తి పిచ్చి ... 20
కైలాసంలో కలికాలం ... 40
తిమ్మిని మించిన బమ్మి ... 67
పంచపాండవులు–
ఫామిలీప్లానింగ్... 74
**సీరియల్ కథలు :**
వర్కింగ్‌హోం ... 28
సాగర మధనం ... 58
**వ్యాసాలు, శీర్షికలు :**
లోకంపోకడ—5, ఉత్తరాలు—6, వినాయకచవితి-ఆరోగ్యపు టంతరార్థాలు-7 వారఫలం—18, ప్రశ్నావళి—23, డాక్టరు సలహాలు—24, బొమ్మల మహాభారతం-26, కలలో వినాయకుడు-44, నాకునచ్చిన జోకు, సినిమా 46, సినిమా జోహాయణం-51, ఇరుగు-పొరుగు—56, హైదరాబాద్ నోట్ బుక్—64, ఫిలాక్సుని డైరీ—65, వంటలు—73, ధర్మపథం — 80.

## లోకంపోకడ









**శుభాకాంక్షలు!**

**మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటన కర్తలకు మా వినాయక చవితి శుభాకాంక్షలు —సం.**




## ముఖచిత్రం

21—8—81వ తేదీ నాటి ముఖచిత్రం భారత భాగ్య విధాతా ... చాలా బాగుంది. 59వ పేజీలోని కార్టూను చూడటంతోనే నవ్వు తెప్పించేదిగా ఉంది. బలహీనత కథ మనిషిలోని బలహీనతలకు అద్దం పట్టేదిగా వుంది. రచయిత గారికి నా ధన్యవాదములు.

పెర్ని సత్యనారాయణ, పసుపులేటి గాంధి, బుజ్జి. [చల్లపల్లి].

* * *

14—8—1981 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక మీది ముఖచిత్రం కొత్త అందాన్నిచ్చింది. ఎదురు చూపు సీరియల్ ప్రారంభంలోనే ఆకట్టు కుంది. ఇదే సంచికలోని శీర్షిక ఆరల్ సముద్రం ఉల్కాపాతం వల్ల ఏర్పడిందా? ఎంతో విజ్ఞానాన్నం దించింది.

వి. వి. సత్యం, వి. చంద్రశేఖర్ [కరీంనగర్].

* * *

ముఖ చిత్రాలు ప్రచురించడంతో తనకు తనే సాటి అనిపించుకొంది 14.8.81 ఎన్.టి.ఆర్., ప్రేమ ముఖ చిత్రంతో. ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగుంది. ఇంక పోతే సీరియల్ ఇంటరెస్టుగా సాగుతున్నాయి. కథలు, కార్టూన్లు బాగున్నాయి.

చడుపల్లి వేణుగోపాలరావు, ఎస్. సత్యనారాయణ [నిడదవోలు].

* * *

21—8—81 సంచిక ముఖచిత్ర చాలా చక్కగా వుంది, చిత్రకారుడి భావం. ఎంతో మంది ప్రాణాలొడ్డి సాధించిన ఈ స్వాతంత్ర దినోత్సవము నాడు ఒక్కసారి ఆ మహాత్మునికు నివాళులు అర్పించడం మన విధి. ఇంత చక్కని భావం దాగి ఉంది. చిత్రకారునికి మా అభినందనలు.

పి. రమాదేవి, పి. రేణుకారాణి [సికింద్రాబాదు]

* *

21—8—81 తేది స్వాతంత్ర్య దినోత్సవ సంచికప ముఖ చిత్రంగా త్రివర్ణ పతాకంతో స్వర్గీయ బాపూజీగారిని పిల్లలు కొలుచుచున్నట్లుగా ప్రచురించి అసలు మనకు స్వాతంత్ర్యం లభించేందుకు మూల పురుషుడైన గాంధిగారి మీద భక్తి శ్రద్ధలను కలుగచేసేలా ప్రచురించారు.

ఛార్లెస్ డయానాల వివాహమహోత్సవ వివరాలతో వారి ఫోటో ప్రచురించినందుకు థ్యాంక్స్.

ఎస్. అబ్దుల్‌హుస్సేన్ [చిన్నగొట్టిగల్లు]

* * *

ఆగస్టు 15 సందర్భమున,మనకు స్వాతంత్రము సిద్ధించిన సందర్భమున వచ్చిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖచిత్రము బాగున్నది. "భారత భాగ్య విధాత" మన బాపూజీ గాంధిజీకి భారత మాత నీరాజనాలు అర్పిస్తున్నది. భావి పౌరులు నడగగా బాలుడు, బాలిక తమ మొక్కులతో హస్తాలతో మహాత్మునికి తమ శ్రద్ధాంజలి ఘటిస్తున్నారు.

ఎస్. గిరిజాప్రసాద్ [తిరుపతి]

## సీరియల

మా అభిమాన అందాల పత్రిక చదువుటకు ఎంతో ఆకర్షణీయంగా ఉంటోంది. పర్ఫింగ్ హౌస్ సీరియల్ బాగుంది. రచయితకు నా ధన్యవాదములు.

వై. కొండలరావు [శ్రీకాకుళం].

* * *

దేవుడు చూస్తూనే ఉన్నాడు దేవుని పేరుతో దేవుని సాక్షిగా అందున శ్రీనివాసుని సమక్షములో ధర్మరాజులాంటి స్వార్థపరులు ఎన్ని అక్రమాలు తమ స్వార్థానికి చేయుచున్నారో బి. సుబ్రమణ్యం గారు విపులంగా వివరించారు. తోటపల్లి శ్రీ వెంకటేశ్వరస్వామి ఇతివృత్తంగా తీసుకున్న ఈ కథ ముగింపులో నాగావళి వరదల్లో, తోటపల్లి కోవెలకు బీటలు వారినదనియు, కళ్యాణ మంటపం తుడిచిపెట్టుకుపోయినదనియు. విగ్రహాలుకొట్టుకొనిపోయినవనియు, గత వైభవాలకు చిహ్నంగా శిధిలమైపోయి, వెలవెలా పోయిన కోవెల మాత్రం మిగిలిపోయినదనియు అనాస్తవాలను చూచి అవాక్కయి పోయితిని ఎంత కల్పనయినా, వాస్తవాలకు అతి సమీపంలో వయనించిన యిట్టి విశిష్టమైన కథలో అవాస్తవాలను జొప్పించుట అందులో శ్రీనివాసు నిడనికిపిట్ల అక్రమమనే చెప్పాలి.

ఆర్ పద్మనాభరావు [ టెక్కలి ]

## కథలు

శోభన్‌బాబు, రతి ముఖ చిత్రంతో వెలువడిన 7—8—81 సంచికలో కథలు బాగున్నవి. ఈ సంచికలో ప్రారంభమయిన పెద్ద కథ ఎదురు చూపు ప్రారంభంలోనే ఆకట్టుకుంది. లోకంపోకడ వూహెన్ కార్టూన్ల వలన పేపరు చూడవలసిన అవసరం లేనట్లుగా ఉన్నవి. ధర్మపథంలో బులుసు వేంకట రమణయ్యగారు చాలా చక్కగా వివరిస్తున్నారు.

కె. శివరామకృష్ణప్రసాద్. [పింగళపాలెం]

* * *

21.8.81 వ తేది నాటి మీ (మా) ఆంధ్ర సచిత్ర వారపత్రికలో — బలహీనత కథ చాలా బాగుంది. ముఖ్యముగా ఈ రోజులలో ఫాషన్‌గా మనము లేక పోతె లైక్ చేయరు, రాణి లాంటి వారు మరియు తదితరులు.

జి. భాస్కరరావు, జి. పద్మావతి (ఏలూరు)

* * *

14.8.81 ఆంధ్ర సచిత్ర వార పత్రిక అందమైన ముఖ చిత్రంతో మమ్మలను మురిపించింది. ఎదురు చూపు పెద్ద కథ నాకు చాలా నచ్చింది. ఈ కథ కోసం నేను ఎదురు చూస్తున్నాను.

ఆర్. పి. లత (మద్రాసు)

( 82 వ పేజీ చూడండి )



# వినాయక చవితి - ఆరోగ్యపు టంతరార్థాలు

హిందువుల శాస్త్ర, పురాణేతిహాసాలు, ఆచారాలు కేవలం శుష్క సాంప్రదాయములు కావు. ప్రతి ఆచారమూ, సంప్రదాయమూ ఏదో ఒక సదుద్దేశాన్ని మనసు నందిడుకొనియే మన ప్రాచీనులు నిర్ణయించారు మన పండుగలు కేవలం ఆధ్యాత్మిక ఆనందదాయకములే గాక, ఒక్కొక్క పర్వం ఒక్కొక్క రకమైన ఆరోగ్య చర్యకు ప్రతీకగా ఉన్నది.

ఆరోగ్యం దృష్ట్యా వినాయక చవితి పండుగకు అత్యంత ప్రాధాన్యమున్నది. వినాయకునికి జరిగే ప్రతిపూజ, నివేదించే భక్ష్యములను వృక్షశాస్త్ర, ఆయుర్వేద శాస్త్రముల దృష్ట్యా పరిశీలిస్తే గణేశపూజ వెనుకనున్న వైజ్ఞానిక తత్త్వ దృష్టి సుబోధకం కాగలదు.

అనేక రకముల పిండివంటలుండగా, వినాయక చవితినాడు వినాయకునకు తైల సంస్కారంలేని ఉండ్రాళ్ళు, కుడుములను నివేదించుటలో విశేషార్థము ఇమిడియున్నది. నీరు పోసి ఉడికించిన వరిపిండిని ఉండలుగా చేసి, అందు సెనగపప్పుకాని, పెసరపప్పుకాని, తరిగిన కొబ్బరి ముక్కలనా కాని పూర్ణం మాదిరిగా పొదిగి, ఆవిరితో ఉడికించిన ఈ ఉండ్రాళ్ళు శరీరానికి బల, వీర్య పుష్టుల దానంగుననీ, మేహ శాంతి చేస్తుందనీ, పిత్త దోషమును హరించి, ఉదావర్త రోగములను శమింప చేస్తుందనీ "సుప్రసిద్ధాహార గుణ మంజరి" అనే వైద్య గ్రంథములో పేర్కొనబడింది. ఆవిరి మీద ఉడికిన వంటకాలు సులభంగా జీర్ణమగుటే గాక, బలమునిచ్చునని ఆయుర్వేదము నుడువుచున్నది.

కుడుములలో బెల్లం వాడటం పరిపాటి. బెల్లం జీర్ణశక్తిని కలిగిస్తుంది అనీ, వాత, పిత్త రోగనివారిణి అనీ, 'శుశ్రుత' అనే ఆయుర్వేద గ్రంథము తెలుపుచున్నది. కుడుములు, ఉండ్రాళ్ళు అగ్ని దీపనము నిచ్చునని, వీర్యపుష్టి కలిగించునని పెద్దలు వ్రాసి ఉన్నారు. ఉండ్రాళ్ళలో బియ్యపు పిండి, పెసరపప్పు, సెనగపప్పు వాడటం వలన స్టార్చ్ దృష్ట్యా బియ్యపుపిండి, మాంసకృత్తుల దృష్ట్యా పప్పులు కలిసి ఉండటం వలన, ఈ ఉండ్రాళ్ళు బలవర్ధక ఆహారమని చెప్పవచ్చును.

భాద్రపద మాసారంభ కాలానికి నువ్వుల కోతలు పూర్తయిపోయి ఉంటాయి. కనుక నాడు నువ్వులు, బెల్లం వేసి 'చిమ్మిలి' తయారుచేయటం, చిమ్మిలిని గణపతికి నివేదించటం చాలా ప్రాంతాలలో ఆచారంగా ఉన్నది. నువ్వులు శ్వాసరోగాలను, నేత్ర వ్యాధులను నివారించి, శరీర దారుఢ్యానికి ఇతోధికంగా తోడ్పడునని ఆయుర్వేదోక్తి.

ఇన్ని ఆరోగ్య సూత్రాలను దృష్టిలో ఉంచుకొనియే మన పూర్వీకులు వినాయక చవితినాడు కుడుములు, ఉండ్రాళ్ళు, చిమ్మిలి మున్నగు భక్ష్యములు చేసుకునే ఆచారం ఏర్పరచినారు.

వినాయక చవితినాడు వినాయకునికి "ఏకవింశతి పత్రపూజ" జరపటం ముఖ్య ఆచారం. అనగా ఇరువది యొక్క పత్రులతో పూజించటం. ఈ ఇరవై ఒక్క రకాల మొక్కలకు ఔషధాలుగా అత్యధిక ప్రాముఖ్యం ఉన్నది. బిల్వపత్రాల పసరు శరీరానికి రాసుకుని స్నానం చేస్తే చర్మరోగం నివారణ కాగలదనీ, ఉమ్మెత్త పత్ర రసం తేలుకాటు, ఎలుక కాటుల విషాన్ని విరచగలదనీ, బదరీ పత్రము గాత్ర శుద్ధికీ, ఉత్తరేణి పసరు దంత పటుత్వానికి తోడ్పడగలదనీ, తులసి పత్రం నోటి పూతకు ఔషధంగా పని చేయగలదనీ వైద్యశాస్త్రం తెలుపుచున్నది.

గన్నేరుపత్రాల పసరు తలలోని చుండ్రును నివారిస్తుందనీ, దేవదారు పత్రం క్రిమికీటక నాశనిగా పనిచేయుననీ, జాజి అజీర్ణ నివారిణి అనీ, మద్దిపత్ర రసం 'అర్జునారిష్టం' అనే ఆయుర్వేద టానిక్ తయారీకి పనికివస్తుందనీ ఆయుర్వేద శాస్త్రం నుడువుతున్నది.

'సిద్ధివినాయక వ్రతకల్పం'లో 'దూర్వార యుగ్మం పూజయామి' అంటూ గణపతిని గరికపోచలతో అర్చించాలని చెప్పబడి ఉన్నది. గణపతిని గరికపోచలతో అర్చించుటలో కూడా ప్రత్యేకార్థం ఇమిడిఉన్నది. సర్పి, విడుము మున్నగు వ్యాధులకు మంత్రం వేసే వారు గరికపోచలతో మంత్రించటం ముఖ్యంగా గమనార్హమైన విషయం. ఈ ఇరువదియొక్క రకాల పత్రుల గురించి ఆయుర్వేద శాస్త్రంలో అధిక ప్రాధాన్యం ఉన్నది. వీటిని సంపాదించి, శుభ్రపరిచి ఔషధాలుగా వాడుకొనుటకు, ఈ పత్రాలన్నీ విరివిగా లభించేందుకు భాద్రపద మాసం అనువైనది. అందుచేతనే పూర్వులు ఈ వినాయక చవితిని ఆలంబనం చేసుకుని పత్ర సేకరణకుగాను పత్రిపూజను విధ్యుక్తం చేశారు.

ఈ విధంగా వివిధ ఋతువులతో వచ్చే పర్వదినాలలో, ఆయా ఋతువులలో ప్రకృతిలో లభించే వస్తు సముదాయమును ఆయా శీతోష్ణ పరిస్థితుల కనువైన రీతిగా, ఆరోగ్య సూత్రాలను మనసునందిడుకొని, ఆచారాలు సంప్రదాయాలు అనే నెపంతో అనేక ఆరోగ్య సూత్రాలను పొందుపరచిన మన పూర్వుల వైజ్ఞానిక, తత్త్వ దృష్టికి మనం జోహార్లు అర్పించి తీరాలి.

— "హేమచంద్ర"



పెద్దకథ

# విధి చాలసూక్ష్మమా?

శ్రీ విరించి

ప్రారంభం



**'డ్రైవర్ డ్రైవర్' అంటూ కేకలేసింది ఉమ, తనగదిలోనుంచే.**

**మరునిమిషం వసారాలో నుంచి పని మనిషి కాంతమ్మ గదిలోనికి వచ్చింది, 'అమ్మగారూ! పిలిచారా?' అంటూ.**

'నిన్ను కాదు'

కాంతమ్మ నవ్వింది.

'డ్రైవర్ మేడమీద వుండాడండి — ఏం చెప్పమంటారు ? కారు సిద్ధం చేయమనేనా ?'

— ఉమ ఆఖరుసారి అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచుకుంది. కాంతమ్మ మాటలు విని ఆమె వంక తీక్షణంగా చూచింది. ఆఖరుకు పనిమనుషులు కూడా తనకు జవాబు చెప్పతున్నారు !

ఆమె కోపంగా చూడడంతో, కాంతమ్మకు లోపల లోపల కొద్దిగా భయం వేసినట్లయింది. బతిమాలుతున్నట్లుగా అనునయంగా 'యేం అమ్మగారూ! అతనికేం చెప్పమంటారు ?' అంది.

'నాలుగేళ్ళనుంచి పనిచేస్తున్నావన్నమాటే గాని నీకు బొత్తిగా ఇంగిత జ్ఞానం లేదు కాంతమ్మా' చాల విసిక పట్టి అంది ఉమ.

కాంతమ్మ ముఖం చేటంత అయింది. అమ్మగారి కోపం పోయిందన్నమాటేగా!

'నాకేం తెలుస్తుందండీ-' అంది ముసి ముసిగా నవ్వుతూ.

'కారు సిద్ధం చేయమని కాకపోతే డ్రైవర్‌తో నాకు రాచకార్యాలు యేముంటాయి ?' అంది ఉమ యింకా కోపంగా చూస్తూనే.

'ఆ మాట యింకాకనే అడిగాను కదండీ. నన్ను వెర్రిదాన్ని చేసి...'

''ఓసి వెర్రిదానా! ఆమాట అడగాలంటే? కేక వినగానే చెప్పిరావద్దూ ?'' అంది ఉమ కుర్చీలో నుంచి లేచి నిలబడి.

'చిటికలో చెప్పివస్తానమ్మగారూ !' అంటూ కాంతమ్మ బయటకు పరుగుతీసింది.

ఉమ బల్లమీద పుస్తకం తీసి చేత పుచ్చుకుంది.

గడియారం వంక చూచింది.

సరిగ్గా నాలుగున్నర

ఇంతలో కాంతమ్మ మళ్ళీ పైకి వచ్చింది

'డ్రైవర్ లేడు అమ్మగారూ !'

'ఎక్కడకు వెళ్ళేడట ? కారు గరేజిలో వుందా లేదా ?'

'ఉన్నదండీ. టీ తాగివస్తానని చెప్పి అరగంట క్రిందట వెళ్ళాడట. వేగం లాక్కురమ్మని గురవయ్యను పరిగెత్తించాను లెండి ఈ పాటికి తిరిగి వస్తూనే వుంటాడు—' అంది కాంతమ్మ యజమానురాలి పనిని తాను చాకచక్యంతో చేసినందుకు ఆమె మెచ్చుకుంటుందేమో! చూచి సంతోషిద్దామని.

'వెధవకు గంట గంటకూ టీ! సరిగా సమయానికి వుండడు. ఈ డ్రైవరందరికీ యిదే జబ్బు—' అంది ఉమ, దాదాపు అర్ధ స్వగతంగా.

'డబ్బంతా టీ దుకాణానికే యిస్తున్నట్లున్నాడండీ. ఇంటిదగ్గర పిల్లా జెల్లా—' అంటూ మొదలెట్ట పోయింది కాంతమ్మ

'చాల్లే ఊరుకో, నీ సోది కూడా యిప్పుడేనా ?'

'అది కాదు అమ్మగారూ !'

'యేంటే !'

'వాడికిచ్చే నూటయాభయిలోనూ—'

'వాడి గొడవ వద్దని చెప్పానా లేదా?'

'ఆ సంసారం...'

'అబ్బ—కాంతమ్మా, నువ్వు బయటకు వెళ్ళి, వాడు వచ్చాడో లేదో చూడు-'

'రాగానే గురవయ్యను పైకి వచ్చి చెప్పమన్నాను అమ్మగారూ !'

'అన్నీ యేర్పాట్లు చేసుకునే వచ్చావన్న మాట !'

'అయినా యేంతొందరండీ అమ్మగారూ ! అయ్య యింకా రాలేదుగా !'

'మీ అయ్యా ఒకనాడయినా అన్న ప్రకారం వచ్చారంటే !'

'వారు రాకపోయినా మీరు వెడతారు గనుక వారికీ విషయమే గుర్తుండదు అమ్మగారూ!'

ఉమ విసుగ్గా చేతిరుమాలతో నుదురు తుడుచుకుంది. మళ్ళీ కుర్చీలో కూలబడింది. పుస్తకం పుటలు విప్పి ఒక్క క్షణం పరికించింది.

'ఈ గురవయ్యగాడు కూడా ఆ టీ దుకాణంలోనే కూరుకుపోయినాడేమో !'

'పాపం, తీరా అక్కడకు వెళ్ళిన తర్వాత ఒక అరకప్పు పుచ్చుకుందామని కుతి అయిందేమో అమ్మగారూ !'

'యేడిసినట్లే వున్నాయి నీళ ఆటలు ! అప్పుడే అయిదు గంటలయి పోయింది. నువ్వయినా వెళ్ళి యిద్దరినీ యీడ్చుకురా.''

కాంతమ్మకు మళ్ళీ యీ మారు తప్పలేదు.

ఎంత యిష్టం లేకపోయినా ఆ విషయాన్ని ముఖంలో కనిపించనీయకుండా మెల్లగా బయటకు నడిచింది.

జూబిలీ క్లబ్బులో సాయంత్రం ఆరుగంటలకు గొప్పపార్టీ జరగబోతోంది. దానికి సకాలంలో అందుకునేట్లు వెళదామని ఉమ తాపత్రయ పడుతోంది.

'ఇంకా అయిదేనా కాలేదుగా! ఓ పావు గంటసేపు వారి కోసం ఎదురుచూచి మరి వెడతాను' అనుకుంది.

అబ్బ ! ఎదురుచూడడం అంటే ఒకటే తలనెప్పి.

ఎంతసేపని ఎదురుచూడడం ? ఎంతకాలమని యిలా...ఎంతమంది కోసరం ?

ఆయన యింకో పావుగంటకు ఇంటికివచ్చిన చాలు. ఒక పదినిమిషాల్లో అక్కడకు చేరుకుంటారు. అయిదునిమిషాలు ముందుగానే చేరుకుంటారు. అతిథులందరినీ ముందుగానే పలుకరించవచ్చు. కొత్తవాళ్ళను పరిచయం చేసుకోవచ్చు. ఏదీ, యింతకు ఆయనగారు వస్తే గదా !

చెప్పిన టైముకు ఎప్పుడు వచ్చారు గనుక ?

ఏవో పనులు, యేవో సాకులు— చెబుతారు. ఈ ప్రపంచాన్నంతా తామే భరిస్తున్నట్లు, యేలుతున్నట్లు చెబుతారు. అన్నీ నిజమేనేమో ! ఎవరికి కావాలి ? అన్న టైముకు రారు. అన్న ప్రకారం చేయరు. తను ముందుగా చెప్పిందంటే మరీ జాప్యంచేసారు. ఒట్టి బద్ధకం ! కాదు, తమకు కావలసినవన్నీ టంచనుగా టైం ప్రకారం చేసుకోవడంలేదూ? తను చెప్పిన పనులు చేయడానికి ఆయనకు ఎక్కడలేనిబద్ధకం వచ్చేస్తుంది. ఎక్కడెక్కడి తొందరపనులు, తమ కోసమే కాచుకొని వుంటాయి. ఆయనకు ఆ ధ్యాస వుంటేగా అసలు !

ఎంత ముచ్చటగా జరుగుతుంది పార్టీ !

ఎందరెందరు స్నేహితులు వస్తారు !

అందరినీ మళ్ళా ఎన్నాళ్ళకో ఒక్కచోట ఒక్కమారుగా చూడడం జరిగేది !

అధికారం వున్నందుకు— అలంబన చిక్కినందుకు యేమిటి ఫలం, యిటువంటి పార్టీలకు వెళ్ళకపోతే !

ఏమిటో ఆయనకు యీ ధ్యాసే వుండదు.

చెప్పినా వినరు, పట్టించుకోరు...

కాంతమ్మ వచ్చింది.

'డ్రయివర్ వచ్చాడు అమ్మగారూ! కారు ఎప్పుడో రెడీగా వున్నదట. రండి' అంది.

ఉమ గడియారం వంక చూచింది, అప్పుడే అయిదున్నర అయింది.

బయలుదేరబోయి, ఉమ మళ్ళీ ముఖం అదోలా పెట్టి 'యింకో పావుగంట ఆగి బయలుదేరుతాను—'అంది.

కాంతమ్మ నవ్వింది.

ఉమ కోపంగా చూచింది.

పనిమనిషి ! ఎందుకలా కోతిలా నవ్వుతుంది ?

తనంటే చులకనా ? కాదు ! తిడితే యేడుస్తుంది మళ్ళీ.

దీన్ని సాగతీయలేక తల ప్రాణం తోకకు వస్తుంది తరువాత; పోనీలే నవ్వనీ !

'అమ్మగారికి ఆత్రం జాస్తి. ఇందాకటి మంచి నా ప్రాణం తోడేశారా ? తీరా కారు రెడీ అయేటప్పటికి యింకో పావుగంట అంటున్నారు' అంది కాంతమ్మ – గోడకు జారగిలపడి కూర్చుంటూ.

'మీ అయ్యగారు వస్తారేమోనని చూస్తున్నానే—'

'మరి అంత తొందర పెడితిరి ! పాపం, గురవయ్య టీకప్పు సగంలోనే వదిలి లగెత్తుకు వచ్చాడు.'

'యేడవలేకపోయినాడు. ఏ పనీ చెప్పిన చేయడం చేతకాదు. వట్టి నిద్రమత్తు మనుష్యులు—'

'అంతేనండి అమ్మగారూ! వాడికి చెప్పిన యే పనీ ఒకంతట పూర్తికాదు—'

ఉమకు యీ కబుర్లంటే విసుగు.

కాంతమ్మ వద్దన్నా చెబుతుంది.

'ఎవరూ వినకుండా వుంటేనే దానికి బోలెడన్ని కబుర్లు పుట్టుకు వస్తాయి. కోరి చెప్పించుకుంటే యింకా ఎన్ని చెప్పగలుగుతుందో !'



## విధి చాల సుఖమా?

ఉమ ఆలోచనలు మళ్ళీ కదిలాయి—

ఆయన యిాపరికన్నా బయలుదేరి వుంటారా ?

సగం దారిలో వుంటేవాలు ... మరో అయిదారు నిమిషాలలో యింటికి వచ్చేస్తారు. అవును.. తాను కాస్సేపు వేచి వుండడం మంచిపనే చేసింది. ఇద్దరూ కలిసి చక్కగా వెళ్ళి రావచ్చును. ఆయన కూడా వుంటే తనకెంత హాయి! పరాయి చోటుకు వెళ్తే పలుకరించే వాళ్ళు ఉన్నా, లేకపోయినా ఆయన పక్కన వుంటే తనకు ప్రాపంచిక మయిన విషయాలేమీ పట్టవు అవన్నీ ఆయనే చూచు కుంటారు తను ముచ్చట్లు చెప్పుకుంటూ ఊహాలోకంలో—ఆనందంగా హాయిగా తేలిపో వచ్చును. ఏరీ ! యింకా రాలేదే ! ఇంకేం వస్తారు ? పుణ్యకాలం కాస్తా పూర్తయి పోతూ వుంటేనూ ?

అబ్బబ్బ ! ఈ మనిషితో యిదే చిరాకు.

ఉమ యిలా ఆలోచనలతో సతమతం అయిపోతూ వుండగా కింద కారు హారన్ మోగింది.

'ఎవరో వచ్చారు అమ్మగారూ !' అంది కాంతమ్మ.

'ఎవరో చూడిరా.'

కాంతమ్మ బాల్కనీ వయిపు వెళ్ళి కిందకు చూచింది.

'మీ స్నేహితురాలు – ఇందిరమ్మగారు వస్తున్నారండీ !' అని ఉత్సాహంగా చెప్పింది.

'ఇందిరా ! గుడ్...' అనుకుంది ఉమ. ఇంతలో ఇందిర మేడపైకి రానేవచ్చింది. ఉమ గుమ్మంవరకూ వెళ్ళి స్నేహితురాలికి స్వాగతం యిచ్చింది.

'రా... ఇందిరా ... రా ... సమయానికి దేవతలా వచ్చావు.'

'అదేమిటే ఉమా ? యేమిటా శుభ సమయం ?'

'నువ్వు రావడం కంటే శుభం యింకేం వుందమ్మా !!' అని ఉమ కాంతమ్మతో 'కిందికి వెళ్ళి వంటమనిషి నడిగి రెండు కప్పులు కాఫీ పట్టుకురా' అంది.

'ఇప్పుడెందుకు ఉమా, నేను యింటిదగ్గర తీసుకునే బయలుదేరాను. ఏమిటే, యెక్కడికో వెళ్ళటానికి తయారయి నట్లున్నావే ఏం విశేషం ?'

ఈ మాటలతో ప్రసక్తి లేకుండానే కాంతమ్మ కిందకు వెళ్ళింది కాఫీ తీసుకు రావటానికి

'ఇవాళ జూబిలీ క్లబ్బులో గొప్ప విందు ఇందిరా! మహారాష్ట్రదేశం నుంచి ఎవరో పెద్ద చిత్రకారుడు వచ్చాడట! ఆయన గౌరవార్థం. అక్కడకు వెడదామని తయారయి ఆయనగారి కోసం ఎదురుచూస్తున్నాను'

'అలాగా! శ్రీవారికోసం ఎదురుచూస్తూ వుండగా పానకంలో పుడకలాగ నేను తారసిల్లానన్నమాట!'

'పో, యిందిరా! నీ పోచుకోలు మాటలు పోనివ్వావు గాదు' అంది,

ఉమ కాస్త సిగ్గుపడ్డట్లు అభినయిస్తే బాగుంటుందని ప్రయత్నం చేస్తూ.

'అలాకాదు, నిజం చెప్పు'

'యేమిటి?'

'ఈ పళంగా మీ శ్రీవారు వస్తే నన్ను అర్థాంతరంగా వదిలేసి క్లబ్బుకు వెళతావా లేదా?'

'వస్తే — గిస్తే ... వారి సంగతి నీకు తెలియదు గనుక అలా అంటున్నావు. నాతో పాటు క్లబ్బులకు, కాలక్షేపాలకు వస్తారనేనా నీ వుద్దేశ్యం?'

'నా వుద్దేశ్యం అలా వుంచు. ముందు నీ మాట చెప్పు—'

— కాంతమ్మ ట్రేతోసహా వచ్చింది.

ఇందిర కాఫీ కప్పు అందుకుంటూ 'పాపం మీ వారికోసం వుంచిన కాఫీ నా పాలిట పడింది పోనీ యేంచేస్తాం, చేసుకున్నవారికి చేసుకున్నంత మహదేవ అన్నారు' అంది

కాఫీ తాగడం పూర్తిచేసి ఉమ 'యేం గాలివానలా వచ్చావు ఇందిరా, యేవిటి విశేషాలు' అంది.

'యేమీలేవు. చాలకాలం అయింది గదాని నిన్ను చూచిపోదామని వచ్చాను.'

'పాపం! వింత ప్రేమ!'

'పోనీ అలాగే అనుకోవే! నిజంచెబితే యీ రోజులలో ఎవరికీ నమ్మబుద్ధి కాదు.' అంది ఇందిర.

'అబ్బ! హరిశ్చంద్రుడి చెల్లెలు...! సరేగాని?, వారు వచ్చేట్లులేదు, టైమయిపోతోంది. పోదాంపద—'

'పద- నిన్ను క్లబ్బుదగ్గర డ్రాప్‌చేసి నేను యింటికి వెడతాను-'

'అలా నిన్ను వెళ్ళనీయకేం. నాతోపాటు నువ్వూ క్లబ్బుకు రావాలి!'

'ఒద్దు ఉమా! నాకు పరిచయం లేని మనుష్యుల మధ్య నేనెందుకు — నాకు యిష్టం వుండదూ.'

'పరిచయానికేముంది? ఇప్పుడు చేసుకుంటే పోలా? నాతోరా, నీ పిరికితనం వదలగొడతాను-'

'అలాకాదు. నేను యివాళ రానులే. మరోరోజు చేసుకుందాం'

'యేం, యివాళయేదయినాదుర్మ్ముహూర్తం వుందా? లేక మీవారితో యేదయినా ప్రోగ్రాం వేసుకున్నావా?'

'ఉహూ మావారు ఊళ్ళోలేరు. పనిమీద మదరాస్ ఎళ్ళారు. ఎల్లుండికిగాని రారు—'

'అయితే యింకేం — నువ్వు తప్పకుండా రావల్సిందే! అందరికీ నిన్ను పరిచయం చేస్తాను పద'

ఇందిర తనకు రావడం కుదరదని ఎంత వాదించిన ఉమ వినేటట్టు లేదు. ఏమంటే రాకపోవటానికి ఇందిరకూ గొప్పకారణాలు లేవు. తనకు తెలియని వాళ్ళతో ఎందు ఎందుకని ఆమెబాధ. ఒకసారి తెలుసుకుంటే తెలియవాళ్ళు మిగలకుండా పోతారని ఉమ పూచీ.

'అయినా యిలాంటి సోషల్ గాదరింగ్స్ అంటే నువ్వు ఎందుకు అలా బిరుసంగా వుండిపోతావు ఇందిరా? నీ చలాకీతనం అంత యేమయిపోతోంది నలుగురిలోకి వస్తే! మన ఎడ్యుకేషన్‌కీ—మన కల్చర్‌కీ నలుగురితో కలిసి తిరక్కపోతే, మెలక్కపోతే ఎందుకింకా యీ అడివి జీవితం? రోజల్లా యింట్లో పడికూచుంటే విట్లాగోనుంది గనుక? మన సోషల్ స్టేటస్‌కు ఊళ్ళో పెద్దఅందరితోనూ పరిచయం లేకపోతే రాణింపు యేముంది? కూపస్థ మండూకం లాగ ఒకచోట పడివుండటానికా మనకు యీ సిరిసంపదలు భోగభాగ్యాలు, ఎందుకు యిచ్చాడంటావు భగవంతుడు?—' అంటూ ఉమ ఇందిరకు ధైర్యంచెప్పి ప్రయాణం చేయించింది.

'కాంతమ్మ, కాంతమ్మ — డ్రయివర్‌ను కారు బయటకు తీసుకు రమ్మను—'

'మళ్ళీ నీకారు ఎందుకు ఉమా! నేను కారులోనే వచ్చాగా! దాన్లోనే వెడదాం—' అంది ఇందిర.

'తిరిగి వచ్చేటప్పుడు—డ్రయివర్‌ను కారు తీసుకురమ్మంటాను—'

'ఎందుకు లెద్దూ, ఒక గంటసేపట్లో తిరిగి వచ్చేస్తామంటున్నావుగా! నా కారులోనే నిన్ను దింపి వెడతానులే. మళ్ళీ మీ వారికి కారు కావలసి వస్తుందేమో!'

'వారికికావాలంటే ఆఫీసు కారు వుందిలే.'

'రాద్దూ నా కారులో వెడదాం—'అంటూ ఇందిర ఉమను కిందకు లాక్కువెళ్ళింది.

ఇద్దరూ కారు దగ్గరకు పరిగెత్తారు



## నిధి చాల సుఖమా?

ఇందిర డ్రయివర్ సీట్లో కూర్చుంది.

ఉమ ఆమె సరసనే కూర్చుంది.

కాంతమ్మ అమ్మగారి దగ్గర సెలవు తీసుకుని తిరిగి యింటిలోనికి వచ్చింది గురవయ్య తోటకు నీళ్ళు పడుతున్నాడు డ్రయివర్ కారు గారేజిలో పెట్టేసి తాళం వేసుకుని మళ్ళీ టీ దుకాణం వయిపు వెళ్ళిపోయాడు.

* * *

'మీ శ్రీవారు సరాసరి క్లబ్బుకే వస్తా నన్నారా ?' అనడిగింది ఇందిర.

'బహుశ రారనుకుంటాను. వస్తే యింటికే వస్తానన్నారు అందుకనే యింత సేపు ఎదురు చూచాను వారికి యిలాంటి ఫంక్షన్స్ అంటే అట్టే ఆసక్తి లేదు.'

'నీ కోసమన్నా ఆసక్తి కలిగించుకోనవద్దూ ?'

'నా కోసమా ?...అవును...నాకోసం...' అంటూ ఉమ ఆలోచనలో మునిగిపోయింది.

రెండుక్షణాలు ఊరుకుని ఇందిర మళ్ళీ అడిగింది: 'యేం, ఉమా ! అంత ఆలోచనలో పడిపోయావ్ ? ఇదంతా ఆయనగారు రానందుకు విచారమే !'

'యేమిటి ఇందిరా, చిన్నపిల్లలా చిలిపి మాటలు–'

'పోనీ కాదని చెప్పరాదూ ?'

'అవు లేనేం–కాకపోతేనేం– నీకెందుకు?'

'అంతకోపం అయితే ఆ ప్రసక్తి తీసుకు రానులే.'

'అదికాదే ఇందిరా! ఆయనగారుచూచావా? అన్నప్రకారం రానయినాలేదు.'

'యేదన్న పనివుండి ఆగిపోయారేమో!'

'అదే నేననేది ! వారికి నాకంటే తతిమ్మా అన్నిపనులూ ముఖ్యం–'

'ఛ! అదేమిటి ? అంత నెర్వస్‌గా మాట్లాడతావు! అయినా ఆయనగారు తప్పకుండ వస్తానన్నారా ?'

'అనలేదనుకో అయినా రావద్దూ ?'

'బాగుంది ! అసలేమన్నారు చెప్పు–'

'రావడానికి ప్రయత్నిస్తాను. బహుశ కుదరదనుకుంటాను. ఏ మాత్రం వీలు చిక్కినా వస్తాను. నేను ఒకవేళ రాలేకపోయి నట్లయితే మధ్య డ్రయివర్‌ను తీసుకుని మనకారులో వెళ్ళు అన్నారు– !'

'యింకేం మరి ! ముందే చెప్పారుగా.'

## ఇది ఇంతే మరి !

క్యాన్సర్ నిర్మూలించే
సర్వవేది కని పెట్టాను.
కాస్తేమీ లేకుండానే
ఉచితంగా పంచిస్తాను.
పథ్య పానమేమీలేదు
ఏదైనా తినవచ్చు.
ఒకే ఒక్క షరతుందైతే
అది కూడా చెప్పేస్తాను.
న్యూస్ పేపర్ ముక్కల్లోనే
ఔషధాన్ని సేవించాలి
ఆ న్యూస్ పేపర్లో –
మానభంగాలు – వి
మానహైజాకింగులుండరాదు.
రైలు బస్సు ప్రమాదాలు
దారిదోపిడీలుండరాదు.
పార్టీ ఫిరాయింపులు
నాయకుల ప్రగల్భాలుండరాదు
ఇది ఇంతేమరి !

— సు రా శ ర్మ

'యిది గ్రామఫోన్ ప్లేట్. ఏ సోషల్ ఫంక్షన్‌కు వెళ్ళవలసినా యిాప్లే టే వేస్తారు. ఆఖరుకు సినిమాకయినా అంతే !'

'వారికి తీరదేమో మరి! పెద్ద ఉద్యోగం కదా !'

'ఒక్కరేనా యేం ఉద్యోగం చేస్తున్నదీ ! ప్రపంచంలో తతిమ్మావాళ్ళంతా వాళ్ళవాళ్ళ స్వంతపనులు చూచుకోకుండా అస్తమానం ఆఫీసుకు అంటుకుపోయి కూర్చుంటున్నారా?'

'అయితే వారికి యిలాంటివి యిష్టం లేవేమో !'

'నీకు తెలియదు – చెవికోసుకుంటారు ! తీరదట, తీరదు ! ఆఫీసులో ప్రణాళికలు వేయడంతోటే ఆయన టైమంతా ఖర్చయిపోతుంది. ఇంక నాకోసం బజారుకేం వస్తారు ?'

'పోనీలే మన్నువొక్కదానివే వెళ్ళగలవుగా!'

'వారు పక్కనుంటే వచ్చేహుందాతనం, నాకు వంటరిగా ఎలావస్తుందే ! వారిని

# నిధి చాల సుఖమా?

చూచేగా నాకు యీ సోషల్ స్టేటస్! ఇదంతా నా స్వంతమా యేం?'

'పోనీ వెళ్ళడం మానివేయరాదూ?'

'అదే నీ తెలివితక్కువ. వెళ్ళకపోతే మన ప్రెస్టేజ్‌కు భంగం కదూ? రేపు ఏవళ్ళయిన మనని మనుషుల్లా చూడాలా అక్కర్లేదా?'

'ఆ! చూడకేం చేస్తారు లెద్దూ. వాళ్ళకోసం మనం బతుకుతున్నామా?'

'నీకు అర్థం కావులే యీ బాధలన్నీ, అనుభవిస్తున్న దాన్ని నాకు తెలుసా నీకు తెలుసా?'

'అర్థం కాకపోతే పోనీ, మరేదయినా సంగతి చెప్పు—'

—వాళ్ళిద్దరూ యిలా ఊసులాడుకుంటూ వెళ్ళేసరికి గమ్యస్థానం రానేవచ్చింది.

క్లబ్బు ముందు కారు ఆగింది.

ఉమ ముందు కిందకు దిగింది.

ఇందిర కారును ఆవరణలో పార్కుచేసి ఉమను కలుసుకుంది. ఇద్దరూ లోపలి హాలు లోనికి వెళ్ళారు.

'రండి-రండి'

అప్పుడే హాల్లో జనం నిండిపోయినారు.

'ఆలస్యం అయింది క్షమించండి' అంది ఉమ, అందరిలో కొందరినుద్దేశించి.

'లేదు-లేదు, ఆలస్యం కాలేదు.'

'అయినా నువ్వు కూడా యింత ఆలస్యం చేయడం...యేంబాగుంది?'

'ఏమిటిలాగ మీ శ్రీవారు రావేలేదా?'

'మనకు ఎవరో కొత్త మెంబర్ను తీసుకు వచ్చేనే!'

'ఈ జార్జెట్ చీర మీ వంటికి బాగా నప్పుతుంది.'

'మీరు రాకపోతే యింతవరకు సభకు నిండే యేర్పడలేదు.'

యిలా తెలిసిన వాళ్ళందరూ ఒకరుచేయని పరామర్శ మరొకళ్ళు చేస్తున్నారు.

అందరికీ సమయోచితంగా జవాబులు చెప్పి ఉమ తనకోసం నిర్దేశించిన స్థానంలో కూర్చుంది. ఇందిర యేమీ మాట్లాడకుండా ఆమెనే అంటిపెట్టుకువుంది.

ఇంకా కొందరు ప్రముఖులు రావాలట. వాళ్ళకోసం వేచివున్నారు. సభా ప్రారంభానికి కొద్దికాలం ఆలస్యంవుంది. ఎక్కడికి వెళ్ళినా ఏవరిని చూచినా వేచివుండడంతోటే కాలం

# ఇప్పుడు రుచికరమైన కస్టర్డ్ క్రీమ్ బిస్కట్‌లోని శ్రేష్ఠమైన కోట్టయం ఏలక్కాయ మాధుర్యాన్ని ఆనందించండి



ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు
అందిస్తున్న అద్భుతమైన విందు...
గోధుమరంగు-వలువుగల
శ్రేష్ఠమైన కోట్టయం ఏలక్కాయలలోని
సూనెసారముచేరి దళసరిగా,
పోషకశక్తితోవున్న కస్టర్డ్ క్రీమ్,
కరకరలాడే రెండు బిస్కట్ల మధ్య
అందచేయబడుతుంది.

అదే ట్రూ ఏలక్కాయ కస్టర్డ్ క్రీమ్.
ప్రకృతిలోని అత్యుత్తమమైన
దానితో అద్భుతంగా తయారుచేయ
బడింది.

ప్రత్యేకమైన సెల్లోఫేన్
ప్యాక్‌లో ఏలక్కాయల పూర్తి
సువాసనతో మీ కోసం తాజాగా
భద్రపరచబడింది.







MTM-AEL-2350

## TRUE
## ఏలక్కాయ కస్టర్డ్ క్రీమ్

మీరు మాటుకే చెప్పగల ప్రత్యేక రుచి



AUROFOOD ఆరోఫుడ్ ప్రైవేట్ లిమిటెడ్
భారతదేశపు అత్యాధునిక పిండిమర మరియు
బిస్కెట్ తయారుచేసే సముదాయం

## భాష్యంకందని భావం

భోగం భాగ్యం కాదు
భాగ్యం ఆర్జన కాదు
మంచితో ఆర్జించు కీర్తిని
ఆ కీర్తితో అనుభవించు తృప్తిని
ఇది చరిత్ర తెలుసుకోని సత్యం
భాష్యం చెప్పలేని అర్థం!

— ఎస్. రోహిణి

## నిధి చాల సుఖమా?

కాస్త హరించిపోతోంది. ఒకళ్ళకోసం ఎదురు చూడడంతోనే జీవితకాలంలో ఎక్కువకాలం వినియోగం అయిపోతోంది. ఒక్కొక్కసారి జీవితకాలమంతా ఎదురుచూడడంతోటే సరిపోతుంది. ఇలా చూసుకుంటూ పోతే జీవితకాలం కూడా చాలక పోవచ్చును ఉమకు యివన్నీ తలుచుకుంటే, ఎదురుచూడడం అనేది తనకొక్కదానికే కాదు — ప్రపంచాని కంతటికీ వున్న సమస్యలా గోచరించసాగింది. అయినా తన విషయం ప్రత్యేకం. ప్రతిసారి ఎదురుచూడడమే! దేనికోసం? నిరాశ నిస్పృహల కోసమే గదూ!

నిష్కారణంగా తనశక్తినంతా ఎదురు చూడడంకింద వృధాచేసేస్తోంది. చివరకు తన ఆలోచనలు — తను మిగిలేటట్లు ఎదురు చూడడం తనకు జీవితంలో పరిపాటి అయిపోతుంది. అంతే!

ఉమ — యిందిరకు అక్కడ చేరిన పెద్ద వాళ్ళందరిని గురించీ చెప్పింది. తనకు బాగా పరిచయం వున్నవాళ్ళతో ప్రత్యక్షంగా పరిచయం కూడా చేయించింది

అందరూ గొప్పగొప్ప ఉద్యోగస్తులు; ప్రయివేట్ కంపెనీల భాగస్వాములు, జమిందారులు, శ్రీమంతులు...!

ప్రభుత్వాన్ని నడిపించే వాళ్ళంతా యిక్కడే వున్నారు.

మంత్రులు, డైరెక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు, డాక్టర్లు... ప్రముఖులను యెవరిని కలుసుకోవాలన్నా, సరాసరి యిక్కడకు వచ్చేస్తే సరిపోతుంది. — అనిపించింది ఇందిరకు.

(ఇంకా ఉంది)

# వారఫలం

## 11-9-1981 శుక్రవారం మొదలు 17-9-1981 గురువారం వరకు

మేషం—వ్యాపారంగాని, భూముల విషయంలోగాని చిక్కులురాకుండా చూచుకోవాలి. అతిథి అభ్యాగతుల నాదరించవలసిన వారం. నూతన మిత్రులు చేరుతారు. స్తోత్రప్రియులు తోడవుతారు. అన్ని విషయాలల్లో అనుకున్న ప్రకారమే జరుగుటకు, ఆర్థికంగా ఒక మెట్టు పైకిపోవుటకు గ్రహస్థితి అనుకూలం. స్త్రీలకు వృత్తిలో అభివృద్ధి, శుభకార్యాచరణంగల వారం.

వృషభం— మీరు చేపట్టిన పనులుచాలా అనుకూలంగా నెరవేరగలవు. ఈ వారం, భూములనుబాగు చేయుటమో, గృహవిస రణకార్యక్రమం చేపట్టుటమో జరుగుతుంది. సభలలో, సమావేశాలలో, సంఘ సేవలో మీకు అనుకూలత గలదు. ప్రయాణం చేయవలసి రావటం, సభాగౌరవం సంక్రమించటం చాలముంది విషయంలో చెప్పదగిన అంశం. స్త్రీలకు శుభప్రసావనలు, విద్యాభివృద్ధికి దోహదం గలవారం.

మిధునం—ప్రశాంత వాతావరణం గల వారం. శాంతంగా సర్వరంగాలలో మీకార్యక్రమం కొనసాగించండి. అతిథుల రాకతో మీ పనులకు అంతరాయం గలుగుతుంది. ధర్మకార్యమో, పుణ్యకార్యమో కొందరకు చేయగల అవకాశమున్నది. శుభకార్యాచరణకు కొందరకు అవకాశం గలదు. స్త్రీలకు ఉన్నతవిద్యావకాశాలు, నూతనోద్యోగావకాశాలుండగలవు.

కర్కాటకం— ప్రయత్నిస్తే మీకు సంతృప్తి అన్నిరంగాలలో కనిపిస్తుంది. సభల్లో పాల్గొనటం, సమ్మేళనములలో జోక్యం కలుగజేసి కొనడం, సంఘసేవకు ప్రయత్నంచేయటం, నగలు, వస్త్రాలుకొనటం, వ్యాపారం బాగా సాగించటం, కొందరకు నిరుద్యోగ సమస్యపరిష్కారం కావటం గమనించగలరు. స్త్రీలకు సమస్యలు పరిష్కరింప బడుటం, క్రీడావనిలో అవకాశాలు లభించటం గమనింపదగిన అంశాలు.

సింహం—వారం నిరుత్సాంగా గడుస్తుంది. రావలసిన పైకం చేతికందదు. బాగా కావలసిన వారే మిమ్మలను నిరుత్సాహంచేయగలరు. పై వారం ఒకానొక విషయం పరిష్కారం కానున్నది అందులకు ఈవారమే నాందీ ప్రస్తావన జరుగతుంది. స్త్రీలకు కుటుంబ భారం అధికంకావటం, ఉద్యోగంలో అతస్థ పెరగటం, ఆర్థిక లాభం కూడా గలదు.

కన్య: ప్రశాంతంగాకాలం గడుస్తుందనీ, వారం హాయిగాసాగిపోతుందనీ, ఆర్థికలాభమున్నదనీ నూతనోద్యోగంలో ప్రగతి కనిపిస్తుందనీ చెప్పవీలులేదు. లాభాదాయక విషయాలలో నష్టం రాగలసూచన కూడ గలదు. వృత్తివ్యాపారాలలో అశాంతికలుగుతుందవిభావం. స్త్రీలకు అధిక కోపం, అశాంతి, అతిథుల వలన అనవసరవ్యయం చెప్పదగిన వారం.

తుల—గ్రహప్రాతికూల్యత గలదని, కార్యభంగమైనపుడు, వ్యాపారంలో యిబ్బంది కనిపించినపుడు, ఆరోగ్యం చెడినపుడు, చుట్టు అశాంతి వాతావరణం చుట్టుకొన్నపుడు మీరే గ్రహింపనున్నారు. ఆర్థిక లాభం ఎండమావుల సదృశం. స్త్రీలకువిద్యాభివృద్ధి, కించిత్తు ఆర్థిక సోమత్తు, క్రీడారంగంలో అనుకూలత సంభవం.

వృశ్చికం:—చాలమెత్తని ప్రకృతి మీది స్వభావానుగుణ్యంగా, మిత్రులతో, కుటుంబ సభ్యులతో, బంధువులతో కులాసాగా కాలక్షేపంచేస్తారు. ప్రారంభించిన వ్యారం క్రమాభివృద్ధినొంద గలదని గ్రహింపున రు. ఆదాయంలకిఅభివృద్ధిగలదు. స్త్రీలకు: విద్యాయోగ్యతకు, వయసు వచ్చిన వారికి వివాహప్రయత్నాలకు అవకాశం, ఆర్థికలాభం, నమాకూడేవారవ, ని గ్రహించండి.

ధనుస్సు:—మీరు చేపట్టిన కార్యక్రమం సాఫీగా సాగిపోతుంది. వ్యాపారవృత్తులు లాభదాయకములు. అతిథుల రాక చెప్పదగిన వారం. అధికవ్యయానికి అవకాశం గలవారమే. ఉద్యోగానికిచేసే ప్రయత్నాలు, ఈవారంలో ఒకరేవునకు రాగలవు. స్త్రీలకు వృత్తి ప్రకాశించుట, ఆర్థికాభివృద్ధి, క్రీడారంగానుకూలత కుఅనుగుణ్యమైన వారం.

మకరం:—వారం వారం యిదేనాలమకోండి. గ్రహస్థితిలో చిన్నమార్పులుఅనుకూలదాయకాలు. భూవిషయంలో మీరుచేసేమార్పులు లాభదాయకంకాగలవు. మాటకు అధిక గౌరవంసంభవించేవారం. చాల మందికి వృత్తిలో ఆదాయం, ఉద్యోగంలో పెంపు, లేక ప్రమోషన్ రాగల పరిస్థితులున్నాయి. గ్రహించండి. స్త్రీలకు ఉష్ణాధిక్యత వలననో, అజీర్ణ వలననోరుగ్మత చెప్పదగిన వారం.

కుభం:—చాల నిరుత్సాహ జనకంగా సాగిపోతుందీ వారం. ఒకదానివెంటఒకటిగాసమస్యలుఎదురుకాగలవు. భోజన సౌఖ్యంకూడాఅబ్బదు. సంఘకార్యాలలో నిరుత్సాహతఏర్పడగలదు. ఆస్తికొనే విషయంలో కూడా సమస్యలుఎదురుకాగలవు. స్త్రీలకు ఉద్యోగవృత్తులలో అవరోధాలు, కుటుంబ పరిస్థితిలందు ఆటంకాలురాగల అవకాశమున్నది. గ్రహించి నడవండి.

మీనం:—ఇతరుల బాధ్యతలు నెత్తిన పెట్టుకొంటారు. ఆస్తికొనటంలో యిబ్బందులుండగలవు. వివాహం మొదలైన విషయాలలో తర్జన భర్జనలు జరుగనున్నవి. చికాకులున్నా, ఆర్థికంగాఏదో కొంత అనుకూలత లేకపోలేదు. స్వార్థపూరితులకుదూరంగా ఉండ యత్నించండి. స్త్రీలకు వృత్తిలో ప్రకాశం, కొందరకు నూతనోద్యోగ ప్రయత్నాలు ఫలవంతం కాటం గమనింపగలరు. ఆరోగ్య లోపముండదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# పిల్లల్లో ఆరోగ్యం ఉబికే ఉత్సాహం పొంగులు వారుతూంటే సరి



# వాళ్ళు చేసే అల్లరికూడా యిక ముచ్చటగానే ఉంటుంది మరి.

మాల్టోవా తాగే పిల్లల్లో అసలు ఎంత చురుకూ, ఉత్సాహం ఉంటుందంటే, దూరం మంచే చూసి చూడంగానే టక్కున గుర్తు పట్టెయ్యొచ్చు, వాళ్ళు 'మాల్టోవా పిల్ల'లని. వాళ్ళు జీవితంలోని ఏ రంగంలోనైనా సరే అందరికన్న ఒక మెట్టు పైనే ఉంటారిక.

మరి మాల్టోవా ఎంతో రుచికరమైనది కూడాను. రుచిగా ఉండటమేగాకుండా అత్యంత పుష్టికరమైనది కూడాను. ప్రోటీన్, వైటమిన్లూ, ఖనిజ పదార్థాలతో సమృద్ధి అయినది యిది. దాంతో మీ పిల్లల శరీరం సరియైన తీరులో పెరుగుతుంది. వాళ్ళని ఆరోగ్యంగా ఉంచుతుంది మాల్టోవాతో పిల్లల జీవితంలో ఎంత ఉత్సాహం పొంగులు వారుతుందంటే, వాళ్ళని అలా చూస్తూనే మీరిక సగర్వంగా సంతోషిస్తారు.




అత్యంత వైటమినులతో

## మాల్టోవా

ఆరోగ్యం, బలం మరియు శక్తి కోసం.



**JiL** జగత్‌జీత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్

ASP/JIL/2315-81 Tel R

# రామ్మూర్తి పిచ్చి

మమత పండరీనాధ్

Nagarjuna

మారువేషమేసుకొచ్చిన హీరోలా అగుపించాడు రామ్మూర్తి, రాజారావ్‌కీవేళ. జరగకూడనిది ఏదో జరిగినట్టు ఆఫీసులో మినీ కలవరం బయల్దేరింది.

నవ్వుకు వాచిపోయిన రామ్మూర్తి నల్లని పెదాలు పదివేల కుసుమాలు ఒక్కసారే విప్పారినట్టుగా నవ్వేయి. చంకలకింద్, వీపు మీదో చిరుగులుండే లూజు చొక్కాలేసుకొచ్చే రామ్మూర్తి ఈవేళ పిటపిటలాడే ప్యాంటు, షర్ట్ ఫ్లస్ టక్ చేసుకుని బూజు తుడ్చి అలంకరించబడ్డ శిల్పంలా వచ్చాడు.

కాళ్లకు, ఫుట్‌పాత్‌మీద కొన్న హవాయ్ చెప్పులు లేవు. మిలమిల మెరిసే 'అంబాసిడర్' షూ వున్నాయ్! జిడ్డుకారే మొహం కళకళ లాడుతున్నది.

గడ్డిపరకల్లా ఎగిరి మొహంమీద పడే వెంట్రుకలు సమ్మెమాని 'మేమంతా వొహటే' అన్నట్టుగా చక్కటి క్రాఫ్‌గా మారేయి.

రామ్మూర్తి అకస్మాత్తుగా మారటానికి గల కారణం ?

ఆ ప్రయివేట్ ఆఫీసులో అదో పబ్లిక్ మీటింగ్ అయ్యింది.

మేనేజర్ రాజారావ్ కిటికీలోంచి తూర్పు దిక్కుగా చూసేడు. "నే చక్కగానేవుట్నా" - అన్నట్టుగా తన శీలాన్ని శంకిస్తున్నందుకు మార్తాండుడు మండిపడుతున్నాడు.

రాజారావ్‌లోని మేనేజర్ కూడా మండి పడుతున్నాడు.

"ప్యూన్ వెధవకింతటి ఆడంబరమా ?" పులివాత పెట్టుకున్న నక్కలా అగుపిస్తున్నాడు రామ్మూర్తి, రాజారావ్‌కి.

అర్హతకు తగ్గ ఆడంబరం సంబరంగా వుంటుందని అతని అభిప్రాయం.

"ఏవండీ రాజారావ్‌గారూ ! రోజా ఈపాటికి కాఫీనీళ్ళు ఓ గుక్క పోసుకుని చక్కగా పనిచేసుకునే వాళ్ళం"—అకౌంటెంట్ కొండల్రావ్ పెట్టీ క్యాష్‌బుక్‌ని పక్కకి తోసేస్తూ, తన అవసరాన్ని ఇన్‌డైరెక్ట్‌గా గుర్తుచేసాడు.

అడక్క ముందే కాఫీతెచ్చి తలోగ్లాసులో పంచే రామ్మూర్తి, ఆఫీసుకు రాగానే హాలంతా ఫ్యాషన్ పేరేడ్‌గా చేసి, స్టాఫ్ నంతా ఆశ్చర్యంలో ముంచి డైరెక్టర్ రూంలోకెళ్ళి ఇంకా రాలేదు. అదో సర్‌ప్రైజ్.

డైరెక్టర్ వామ్రావ్ ఓ పెద్ద కమీషన్

అర్డర్ రావాల్సివుండి ఢిల్లీ కెళ్ళాడు మూడ్రోజుల క్రితం. ఇవ్వాళ రావాల్సివుంది. ఏ క్షణాన్నైనా ఊడిపడ్తాడు.

రామ్మూర్తి డైరెక్టర్ రూంలోకెళ్ళి అర్థగంట అవుతున్నది. ఏం చేస్తున్నాడక్కడ? అందరి బుర్రలని తొలిచే ప్రశ్న అది.

ఐరన్ సేఫ్ అక్కడే వుంటుంది. ఇంపార్టెంట్ ఫైల్సన్నీ అక్కడే వుంటాయ్. యస్.టి.డి. కనెక్షన్ వున్న ఫోనూ అక్కడే వుంటుంది.

డైరక్టర్ లేని ఆ రూంలో ఐరన్‌సేఫ్‌ని బ్రద్దలుకొడ్తున్నాడా ?

ఇంపార్టెంట్ ఫైల్స్‌ని తస్కరిస్తున్నాడా?

యస్. టి. డి. కాల్స్ ఎక్కడికైనా చేసేస్తున్నాడా ?

ఇక లాభం లేదనుకొని రాజారావ్ అశ్వంలా పరుగెత్తాడు డైరక్టర్ రూంలోకి. ఎంత వేగంగా వెళ్ళాడో అంతే వేగంగా నోరు లబోదిబో కొట్టుకుంటూ తిరిగొచ్చి —

''మీరంతా డైరక్టర్ రూంలో కన్పించే వింత దృశ్యాన్ని చూడాలహో'' — అని స్టాఫ్‌కి దండోరా వేసాడు గుండెని డోలు చేస్కొని.

అకౌంటెంట్ కొండల్రావ్, కవల స్టెనోలు సుజన, రజని, సేల్స్ రిప్రజెంటేటివ్స్ అయిన సుబ్బారావ్, అప్పారావ్‌లు సినిమా స్టార్ట్ అయిందనే ఆత్రంతో హాల్లో కెళ్ళే ప్రేక్షకుల్లా డైరక్టర్ రూంలో కెళ్ళారు.

ఆ దృశ్యాన్ని చూడగానే వాళ్ళ నోళ్ళు విశ్వాన్ని చూపించిన కృష్ణుడి నోరులా తెర్చుకున్నాయి.

వాళ్ళ మధ్యనించి రాజారావ్ కళ్ళను జ్యోతుల్లా చేస్కొని, రాళ్ళనుకూడా పిండి చేస్తానన్నట్టుగా పళ్లను పటపట లాడించేడు ముందుకొచ్చి.

డైరక్టర్ సీట్లో ఫ్యాన్లా గిర్రున తిరిగే రామ్మూర్తి వచ్చినవాళ్ళ ముఖమైనా చూడకుండా యధాలాపంగా తన స్పీడ్‌ను పెంచుకుంటూ తిరగసాగేడు —

''సూర్యుడిచుట్టూ తిరుగుతోంది భూగోళం'' — అనే పాటను కర్ణకఠోరంగా పాడుకుంటూ.

''ఒరే! రామ్మూర్తీ! నీ కిదేం పోయే కాలం ?'' -- రాజారావ్ బల్లపైన గుద్దాడు పిడికిలిని.

తిరిగే కుర్చీ ఆగిపోయింది. రామ్మూర్తి అందరివంకా చూసేడు — రమ్యంగా నవ్వేడు.

''నా పాట వింటే గాడిదలొస్తాయని నాకు తెల్సు'' —

ఆ మాటకి అందరి మొహాలు మాడిపోయాయి. ''ఒరేయ్'' అంటూ రాజారావ్ తన చేతిని పైకి లేపాడు.

రామ్మూర్తి తక్కున లేచి రాజారావ్ చేతిని జెండా దింపినట్టుగా కిందికి దింపేసేడు. ''ఖబడ్దార్ !'' బలప్రయోగం నా దగ్గర పనికిరాదు.

ఈ రామ్మూర్తి మునపటి రామ్మూర్తి కాదు. వీడిలో చైతన్యం వచ్చింది. 'అరే' అంటే 'వారే' అనాల్సివస్తుంది. మర్యాద ఇచ్చిపుచ్చుకోవాలి.

కాఫీలు లేక మీ గొంతులు ఎండిపోయుంటాయని నాకు తెల్సు. దేశంలో ఎన్నో ప్రాంతాలు అనావృష్టితో బాధపడుతున్నాయ్. మీ గొంతులుకూడా అంతే అనుకుంటాను.

**గమనిక**

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు తిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది

సం.

ఇంటి దగ్గర కాఫీ తాగిరాకుండా, ఆఫీసు సొమ్మని రోజుకు 'సెంచరీ' టైమ్స్‌గా కాఫీని కుడితి తాగినట్టు తాగుతుంటారా ! తప్పకదూ ! రాజారావ్‌గారూ.

నేను పొద్దున్న ఎనిమిది గంటలకు ఆఫీసుకు రావాలి.

మీరేమో మహారాజుల్లాగా పది గంటలకు, పదకొండు గంటలకు రావాలి — ఆఫీసులో ఎక్కడైనా బూజు కన్పడితే నా దుమ్ము దులిపేసేవాళ్ళు — చీటికీ మాటికి కిళ్లీలు, సిగరెట్స్ వన్‌బైవన్ అన్నట్టుగా తీసుక్క రావాలి. కాస్త ఆలస్యమైతే బూతుపాటలు పాడేవాళ్ళు. ఏరా, దున్నపోతా, రాస్కెల్, గాడిదా, చివరకు బాస్టర్డ్. ఇవి మీరు నా కిచ్చిన బిరుదులు. నేనూ ఆత్మాభిమానం కలిగిన మనిషిని. విధిలేక ఆత్మవంచనతో మీ ఆఫీసులో ప్యూన్ పన్జేస్తున్నాను.''

రాజారావ్ మొహం వెలవెలబోయింది. ఏమీ అర్థంగాక కొండల్రావ్ వంక చూసేడు, ఆందోళనగా.

''ఏవండీ ! కొండల్రావ్‌గారూ ! గుడినీ, లింగాన్ని టాబ్లెట్స్‌కన్నా ఈజీగా మింగేసే వాళ్ళు మీరు. అడ్వాన్స్ ఎప్పుడైనా అడిగితే, మీ వొంట్లో రక్తాన్ని పిండుకు పోయినట్లుగా బాధపడేవారు. పైగా ''మీ నాన్న కర్మకా? మీ ఇంట్లో ఎవరి తద్దినమోయ్ ?''—లాంటి అందమైన ఈటెలతో పొడ్చేవాళ్ళు.

నేను కూడా మీలానే ఎదురు తిరిగి మాట్లాడితే, మీ మొహం ఎక్కడ పెట్టుకోవాలో మీకు తెల్సివుండేది కాదు.

డ్రాయర్లో చిల్లరపైసలు పోయేయని వో సారి చేయి చేసుకున్నారు కూడా, గుర్తుందా. ఆ రోజు ఎంతగానో కుమిలి కుమిలి ఏడ్చానో నాకు బాగా గుర్తుంది.''

రామ్మూర్తి చేయి గాలిలోకి లేచి కొండల్రావ్ చెంపను రీసౌండ్ వచ్చేలా చెళ్ళు మన్పించింది. కాకతాళీయంగా జరిగిన యీ అనూహ్యమైన సంఘటనకు కొండల్రావ్ హతాశుడైపోయాడు, కొన్ని క్షణాల వరకు.

''మీ నాన్న కర్మ జరిగిందా? మీ ఇంట్లో తద్దినం పెట్టావా? ఏం మాట్లాడవేం ?'' పెద్దగా అరిచాడు రామ్మూర్తి.

రాజారావ్, కొండల్రావ్ చెవిలో నోరు పెట్టాడు. ''ఏమీ అనకు, రామ్మూర్తికి పిచ్చిపట్టినట్టుగా వుంది.''

''ఇక ఈ టైపిస్ట్ అక్కల విషయాని కొస్తే

రబ్బరు బొమ్మల్లా, స్వయంవరంలో యువరాణుల్లా వస్తారు. రాగానే స్టేజీ ఎక్కబోయే హీరోయిన్లా గంటపైన సింగారం. తర్వాత మిషన్లో పేపర్ పెడతానికి ఓ అర్థగంట, ఒళ్ళు దాచుకోకుండా పన్జేస్తారు. లంచ్ అవర్లో టిఫిన్ తేవటం కాస్త ఆలస్యం అయితే చాలు తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్లగారడీని ప్రదర్శిస్తారు — నన్ను చూసి ఒకటే ఇకఇకలు, పకపకలు; నే అంత వికారంగా వుండొచ్చు. కానీ నాకూ ఆత్మ సౌందర్యం వుంది. పచ్చ కళ్ళ జోడెట్టుకుని మిసమిసలాడే మిస్సులు కాబట్టి మీకది కన్పించదు.''

డైరెక్టర్ వామన్రావ్ ఢిల్లీ నించి ఎప్పుడొచ్చాడో ఏమో ? అందర్నీ తోసుకుంటూ టేబుల్ ముందుకొచ్చి మంత్రించిన ప్రతిమలా నిలబడిపోయాడు.

రామ్మూర్తి నిర్లక్ష్యంగా డైరక్టర్‌వంక చూస్తూ నింపాదిగా లేచేడు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# 1981 దీపావళి కథలపోటీ

## మొత్తం రు. 5000 ల బహుమతులు

**ఈసారికూడా దీపావళికి కథానికలపోటీ పెడుతున్నాము.. పోయినేడాదిలాగే యీ ఏడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఐదు కథలను ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బ్యాలట్ నిర్వహిస్తాము.**

## ముగింపు తేదీ 14-9-'81 సోమవారం

పోటీలో ఎన్నికైన ఐదు కథలకు ఒక్కొక్కదానికి రు **600** ల చొప్పున బహుమతులు యిస్తాము అటు తరువాత బ్యాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు **600**, రు. **500**, రు **400** ల వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన రెండు కథలకు రు. **250** ల చొప్పున కన్సొలేషన్ బహుమతులను అందజేస్తాము.

- ★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి 12 అరటావుల దాటకుండా వ్రాస్తే చాలు నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి
- ★ కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి
- ★ అనువాదం, అనుసరణ, అనుకరణ కాపీ కథలు పంపకూడదు పసార మైన, ప్రచురణ అయిన లేద ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు
- ★ పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విడిగా వుండి తీరాలి. కలం పేరు వాడినా అసలు పేరు, యింటి పేరు ఎడ్రసు పూర్తిగా విడిగా స్పష్టంగా వ్రాసి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది
- ★ కథలతోపాటు రచయితల పేర్లు పడవు బ్యాలట్ తరువాత వారి పరిచయం తోనే వేస్తాము
- ★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది
- ★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫోటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి, వాటి ప్రచురణకు అంగీకరించాలి
- ★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము పోటీకి పంపిన కథలను ఏటి పరిస్థితులలోను తిప్పి పంపలేము

సం॥

## రామ్మూర్తి పిచ్చి

''మిస్టర్ వామన్రావ్! టేక్ యువర్ సీట్.''

''నీ డ్రెస్సేమిటి? నా సీట్లో కూర్చోట మేమిటి? నీకేమయినా పిచ్చిపట్టిందా?'' వామన్రావ్ కళ్లు పెద్దవిచేస్తూ హుంకరించాడు.

''అవును. రామ్మూర్తికి పిచ్చిపట్టింది''– స్టాఫంతా నినాదం చేసారు.

''అయితే వైజాగ్ ఆస్పత్రికి ఫోన్ చేద్దాం'' వామన్రావ్ నెంబర్ డయల్ చేయబోయాడు ట్రంక్ బుకింగ్‌కి.

''మీకా శ్రమ అక్కర్లేదు వామన్రావ్! ఈ పిచ్చి ఇవ్వాళ ఒక్క రోజే. బై ది బై మీకో మాట.

పదో తరగతి ఫెయిలయ్యానని ఇక్కడ ప్యూన్‌గా చేరిన మొదటి రోజే మీకు అబద్ధం చెప్పాను. కారణం నా క్వాలిఫికేషన్ గురించి నిజం చెప్తే దాని స్థాయికితగ్గ వుద్యోగం మీవద్ద లేదు. ఉద్యోగం లేక మూడు సంవత్సరాలు బికారిలా తిరిగాను. నాన్న రిటైరైపోయారు. అమ్మ మంచానికి అంటుకుపోయింది అనారోగ్యంతో. పెండ్లి వయస్సులో ఉయ్యాలూగే చెల్లాయికి పెండ్లి చెయ్యాలి. ఇల్లు గడవాలంటే ఏదో ఉద్యోగంలోనైనా చేరాలి. జీతం ఎంతైనా ఫర్లేదు. అందుకే మూడొందల రూపాయలకు మీ ఆఫీసులో ప్యూన్‌గా చేరాను. మీ ఆఫీసులో నరకంలో బాధించబడే పాపిలా బ్రతికాను. 'చీకటి తర్వాతే వెలుగు' అనే ఆశాసూత్రంపై నాకు నమ్మకం లేకపోయినా ఇప్పుడు మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను.

నాకు డి. యస్. పి. ఉద్యోగం వచ్చింది.

అసలు విషయం మర్చాను. నా క్వాలిఫికేషన్ యం. ఏ.

నా తర్వాత ఎవరైనా ప్యూన్‌గా వస్తే అతన్ని మనిషిగా చూడండి.

రేపే ఉద్యోగంలో చేరాలి'' అని గంభీరంగా, వడివడిగా వెళ్లే రామ్మూర్తి వంక, డైరక్టర్‌తోసహా మిగతా స్టాఫంతా బిక్కమొహాల్తో చూడసాగారు.

ఆ ఆఫీసునించి చివరిసారిగా బయటికెళ్లిపోతున్న రామ్మూర్తికి టాటా చెప్పేందుకు గామోసు ట్రింగ్, ట్రింగ్, ట్రింగ్, ట్రింగ్ మంటూ మోగసాగింది టెలిఫోన్.

# ప్రశ్నావళి * ప్రశ్నావళి * పశ్నావళి * ప్రశ్నావళి * ప్రశ్నావళి

**ఎవ్. పి. – గురిశగురి**

నాకు కథలు రాయాలని వుంది. కాని రచనలు కుదరవు. ఏమి చేయమంటారు ?

★ బ్రూస్ అన్ ది స్పయిడర్ కథ చిన్నప్పుడు చదువుకోలేదా ? ప్రయత్నిస్తూ వుండాలి. అదే వస్తుంది రాయడం.

**వి. ఎస్. ఆర్. – పార్వతీపురం**

ఈ కాలంలో ఏ పని చేయాలన్నా డబ్బుముఖ్యం అంటాను. మీరేమంటారు ?

★ ఎప్పుడేనా ఏ పని సాధించాలన్నా – పట్టుదల, చేసే పనిమీద నమ్మకం కూడా చాలా ముఖ్యం.

మన నాగరికతను, సంప్రదాయాన్ని పాడుచేసేవి ఈ కాలాపు సాంఘిక సినిమాలని అంటాను నేను?

★ నేటి సినిమాకి అంతశక్తి లేదు. చెడిపోయే వాళ్లు ఒక్క సినిమాలు చూసి చెడిపోనక్కరలేదు. చుట్టుపక్కల వాళ్లని చూసేనా చెడిపోవచ్చు. నేడు వస్తున్న రకరకాల సాహిత్యం చదివేనా చెడిపోవచ్చు. అంతెందుకు ఎవరూ ఏం చెప్పకపోయినా చెడిపోవచ్చు!

**ఎవ్. ఏ బి – పుంగనూరు**

కె. రా. గారూ ! డబ్బుకి స్త్రీ దాసోహం అంటాను. మీరేమంటారు ?

★ ఆ స్త్రీకి దాసోహం ఎవరో ?!

**పి. ఎల్. ఎవ్ – శ్రీకాకుళం**

మనిషి ముఖ్యమా ? డబ్బు ముఖ్యమా ?

★ మనిషే. డబ్బెలాగేనా వస్తుంది !

**ఎవ్. ఎన్. ఆర్. – బైపల్లి**

చిన్న చిన్న కవితలు కథలు రాసి పత్రికలకి పంపుతూవుంటాను. అవి తిరిగి వస్తున్నాయి. పత్రికలు కొత్తవారివి ప్రచురించవెందుకు ?

★ ఈనాటి మేటి రచయితలంతా ఒకనాడు కొత్తవారేనయ్యా. ఒక్కటి గుర్తుంచుకో. రాసిన ప్రతీదీ – అత్యద్భుతం, అచ్చు అద్భుతం అనుకో కూడదు. కాకిపిల్ల కాకికి ముద్దు అన్నట్టు మనం రాసుకున్నది మనకి చాలా బాగుండవచ్చు. కాని అందరికీ నచ్చాలని రూలు లేదుగా ? తిరిగి వస్తే సంపాదకులనీ, అచ్చయే రచయితలనీ ఆడిపోసుకో కూడదు – మీ రచననే–ఓసారి చదివి చూసుకోవాలి !

**ఎల్. బి ఆర్. జనగామ**

పతియే ప్రత్యక్ష దైవం అంటారు. నిజానికి సతియే ప్రత్యక్ష దైవం అనాలి అంటాను ?

★ నిజమే. అయినా మీ మాట మీ వాళ్లే ఒప్పుకోరు !

**ఎన్. ఎస్. – ఒంగోలు**

ఆడదాని ఓర చూపుకు అర్థమేమంటారు ?

★ ఒకటా ? రెండా ! అర్థాలు వేయి !

**మూరి – శ్రీహరికోట**

అనుమానం ముందు పుట్టి ఆడది తర్వాత పుట్టింది.

★ కాని అనుమానానిక్కూడా అమ్మా, నాన్నా వుంటారు. ఒక్క అమ్మే వుండదు !

అక్కయ్యా మీరు ఆస్తికులా? నాస్తికులా ?

★ ఆస్తికురాలినంటే – ఆస్తి లేదు. నాస్తికు రాలి ననడానికా ఆస్తి లేకుండామాలేదు. ఎలా ?

**ఆర్. ఎవ్. – ఆదోని**

జీవితాన్ని చూడు రంగు రంగుల అద్దాల్లో – జీవితమంటే అంతులేని ఒక పోరాటం – జీవితం ఒక పయనమని గమ్యం తెలియదని – ఇన్ని రకాల పాటలు విన్నా ఈ మనుషులకు జీవితంపై విరక్తి కలగడం లేదు. కారణం ?

★ ఈ పాటల పక్కనే ఏ జయమాలినో, జ్యోతిలక్ష్మో వుంటుంది ! హీరో హీరోయిన్ల అసభ్య సుందర శృంగార గావవల్లరి వుంటుంది. సన్యాసి పాట నమ్మి ఇవన్నీ అబద్ధం అనుకో మంటారా ? ఇంకా నయం. ఇవన్నీ చూసి సినిమాల మీదే విరక్తి పుట్టలేదే ? జీవితంమీద ఎలా పుడుతుంది ?

**ఎల్. పి. ఎల్. – సికింద్రాబాదు**

ఏ ఎండకా గొడుగు పట్టేవాడే గొప్ప
నీతి, నిజాయితీ అంటే మిగిలేది చిప్ప
బ్రతుకు బాగుపడాలంటే మరొకటి
లేదు ప్రజాసేవ తప్ప !

★ అది కూడా ఎందుకూ గొప్ప ?
అధికారం చాలదా అప్పా !!

**ఎవ్. ఎన్. ఆర్. – జనగామ**

నిజ జీవితంలో కన్న కలలు కలలుగానే మిగిలిపోతే ?

★ నిజ జీవితంలో ప్రయత్నాలు చేయాలి. కలలు కంటూ కూర్చోకూడదు !

**ఎస్. ఎవ్. – నర్సరావుపేట**

మనిషి ఆశాజీవి. ఎంతవరకు ? మీరు మీ పిల్లలకు కట్నం యిచ్చే పెళ్లి చేశారా ?

★ జీవితాంతం వరకు ! లేదు. అది మా ఆశయాలకి విరుద్ధం.

కేవలం నాల్గు గోడల మధ్య కూర్చుంటే ప్రపంచ జ్ఞానం వస్తుందంటారా ?

★ నాలుగ్గోడల మధ్య కూర్చుని ఏమిటి ఆలోచిస్తున్నారన్న దానిపై ఆధారపడి వుంటుంది.

మీరంటే నాకెంతో అభిమానం. మీ ప్రశ్నావళి అన్నీ చించి బైండు చేశాను.

★ థాంక్యూ. ఏ పబ్లిషరో ప్రశ్నావళి అచ్చేస్తానంటే – మీకు రాయమంటాను... ఎందు కంటారా ? నేను చదివి వూరుకుంటాను; కట్ చేసి – దాచుకోను.

**ఎ. ఎవ్. ఆర్. – అవలంగి**

ఈనాటి రచయిత్రులపై మీ అభిప్రాయం ? మీమీద !

★ రాయడం మా వంతు. చదవడం మీ వంతు !!

— కె. రామలక్ష్మి



# డాక్టర్ సలహాలు

— డా॥ కె. వెంకటేశ్వరరావు

**వి. కె - విజయవాడ**

నా వయస్సు 28 సం. లు. నాకు 8 నెలల క్రితం టి. బి. ప్రారంభమయినది. డాక్టరు సలహాపై 6 నెలలు మాత్రలు, ఇంజక్షనులు వాడాను. నా వ్యాధి పూర్తిగా నయమయినట్లేనా? ఈ వ్యాధి జీవితంలో ఇంక ఎప్పుడూ రాకుండా ఉండడానికి తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమయినా ఉన్నాయా? ఈ వ్యాధి నా భార్యకి పిల్లలకి వచ్చే ప్రమాదం ఏమయినా ఉన్నదా? అసలు ఈ వ్యాధి ఎలా వస్తుంది?

టి. బి. [క్షయ] ఉన్నవారు కనీసం 1 సం. పాటు మాత్రలు, ఇంజక్షనులు వాడవలసి ఉంటుంది. కొందరికి 1½ సం. లు మందులు వాడవలసి ఉంటుంది. అప్పుడు కూడా వైద్య పరీక్ష ఆధారం మాత్రమే మందులను ఆపవలసి ఉంటుంది. రోగం పూర్తిగా నయమయ్యే వరకూ మందులు తీసుకొని వ్యక్తిగత జాగ్రత్తలు తీసుకొంటున్నవారికి ఈ రోగం మరోసారి వచ్చే అవకాశం లేదు. మందులు సరిగా వాడనప్పుడు రోగం తిరగబెట్టే అవకాశం ఉన్నది.

టి. బి. రోగం "ఓపెన్ టైపు" అంటే ఉమ్మిలో క్షయ రోగ క్రిములు ఉన్న వారి భార్య పిల్లలకి రావటం అవకాశం ఉన్నది.

ఈ రోగం మైకో బాక్టీరియా ట్యూబరుక్యులోసిస్ అనే సూక్ష్మక్రిమివల్ల ఏర్పడుతుంది.

**పి. ఎన్. ఎస్ - జోగిపేట**

నా వయస్సు 23 సం. లు. వివాహము అయి ఇద్దరు పిల్లలు కలిగినారు. నేను ఫామిలీ ప్లానింగ్ ఆపరేషను చేయించుకున్నాను. నా బ్రెస్ట్ రాను రాను కుంచించుకొనిపోవుచున్నది. ఇలా కావటానికి కారణమేమిటి? వయస్సుకు తగినట్లుగా ఉండాలంటే ఏమి చేయాలి?

ఫామిలీ ప్లానింగ్ ఆపరేషన్‌కి బ్రెస్ట్ తగ్గిపోవటానికి సంబంధంలేదు. మానసిక రుగ్మత, ఆందోళన, శరీరంలో ముఖ్య పోషక పదార్థాల లోపం మున్నగు వాటివల్ల ఇలా జరగవచ్చును.

**ఎ కె - గౌనెల్లె**

నా వయస్సు 20 సం. లు. నాకు ఆవలింతలు వచ్చినప్పుడు వెంటనే కళ్లల్లో నీళ్లు వస్తాయి. ఎందువలన?

ఆవలించినప్పుడు, కంటి రెప్పల నుంచి ముక్కుకి కన్నీటిని తీసుకువెళ్లే నాళం [లాక్రైమల్ డక్ట్] అడ్డం పడి మామూలుగా జరిగే కన్నీటి ప్రవాహం ఆగిపోయి కన్నీరు రెప్పల మీదకి వస్తుంది. అదే విధంగా ఆవలించినప్పుడు కంటి భాగంలో వత్తిడి ఎక్కువై కన్నీటి గ్రంధి నుండి బట్టలయి ఎక్కువ కన్నీరు కళ్లలోకి వస్తుంది.

**ఎస్ యస్ ఆర్. - విశాఖపట్నం**

నాకు 4 నెలల క్రితం పైల్స్ ఏర్పడినాయి. వాటి వలన బాధ ఏమియు ఉండదు. కాని విరేచనం మాత్రం భోజనం గాని టిఫిన్ గాని తీసుకున్న తరువాత మాత్రమే అవుతుంది. నిద్ర మరియు మిగిలిన జనరల్ కండిషన్స్ అవి అన్నీ బాగానే ఉన్నవి.

కొందరికి ఆహారం తీసుకున్న తర్వాతమాత్రమే మలవిసర్జన జరగటం ఒక అలవాటుగా ఉంటుంది. మలవిసర్జనకి ఒక క్రమ పద్ధతిని అలవాటు చేసుకోటం చాలా అవసరం. ఇది చాలా తేలిక. కొన్నాళ్లపాటు ఒక నిర్ణీత సమయంలో మాత్రమే మలవిసర్జన చేయటం అలవాటు చేసుకొని ఆకు కూరలు, పళ్లు ఎక్కువ తీసుకోవాలి.

పైల్స్ ఉన్నందువల్ల మలబద్ధకం ఏర్పడదు. అవి ఉన్నాయనే భయంవల్ల మలవిసర్జన చేయటం, మానటం, అదే అలవాటుగా మారటం జరుగుతుంది.

**డి వి. సి - గుంటూరు**

నాకు అప్పుడప్పుడు జలుబు చేయుటకు ముందు ముక్కులో దురద, తుమ్ములు వచ్చును. వెంటనే 1, 2 అవిల్ మాత్రలు వేసుకున్న అవి తగ్గిపోయి, ఒక వారం రోజులు బాధ ఉండదు. ఈ విధంగా 4 సం.ల నుండి ఉన్నది. కాని ఇప్పుడు ప్రతి రోజు 2 మాత్రలు వేసుకున్నను ఫలితము కనిపించుటలేదు.

మీకు ఉన్న లక్షణాలు అలర్జిక్ రైనైటిస్‌ని సూచిస్తున్నాయి.

ఇలా అలర్జీ ఏర్పడడానికి వాతావరణంలో దుమ్ము, ధూళి, ఉష్ణోగ్రత, హ్యూమిడిటీ ముఖ్య కారణాలవుతాయి. ఏ మాత్రలూ మొదట్లో పనిచేసి రానురాను పనిచేయకపోవడానికి ఆ మాత్రలకి మన శరీరం అలవాటుపడటమే కారణం.

మీరు స్థలమార్పిడి చేసి చూడండి.

**వి. ఎన్ - విశాఖపట్నం**

నా వయస్సు 18 సం లు. నాకు 3 సం లుగా జుట్టు విపరీతంగా వూడిపోవుచున్నది. తలంతా పొట్టు రేగి విపరీతంగా దురద పుడుతోంది. అన్ని రకాల సూనెలు వాడాను. ఎవరో తలకు నూనె రాసుకోకూడదంటే ప్రస్తుతం నూనె రాసుకోవడం లేదు. ఫలితమేమీ కనిపించలేదు.

తలలో పొట్టు ఫంగస్ ఇన్‌ఫెక్షన్ వల్ల ఏర్పడుతుంది. దానికి గ్రిసోవిన్ ఎఫ్.పి. మాత్రలు పూటకి 2 చొప్పున రోజుకు మూడు పూటలుగా వరుసగా 10 రోజులు వాడవలసి ఉంటుంది.

తలకి సబ్బులు కొబ్బరి నూనె పూయటం మంచిది. పళ్లు దూరంగా ఉండే దువ్వెనతో మాత్రమే తల దువ్వితే మంచిది.

**కె ఆర్ కె - వెల్లూరు**

నా వయస్సు 24 సంవత్సరములు. వడువు, పెరుగుట మప్పుడడానికి ఏదైనా మార్గము తెలపండి. మద్రాసులో వీపన్‌ం వలన పన్నబడుటకు వీలగునా? అయినచో అడ్రసు తెలుప ప్రార్థన.

ప్రతివారూ, వారు చేసే పనికి తగినంత మాత్రం ఆహారం తీసికోవటం, ఆహారానికి తగినంత పనిచేయటం చాలా అవసరం.

వ్యాయామం ప్రతి మనిషికీ ముఖ్యం. వ్యాయామం లేకపోవుటవల్ల శరీరంలో క్రొవ్వు పదార్థాలు పేరుకుపోయే అవకాశం ఉంది.

బెంగుళూరులోను, మద్రాసులోను పన్నబడడానికి కొన్ని కేంద్రాలు ఉన్నా వాటిలో కూడా ఆహారం విషయంలో ఎక్కువ జాగ్రత్తలు చెప్పడం జరుగుతున్నది. అడ్రసులు మీరు స్వతహాగా కనుక్కోవలసి ఉంటుంది.

నాకేమిటో భయంగా వుందండీ- అమ్మాయి శ్రద్ధగా కుటుంబ నియంత్రణ కార్యక్రమాలన్నీ వింటున్నది!!!

*రమేష్*

# మంగళకరమైన వెన్నెల మోమును
# మెరుగు పరచటానికి
# ఐటెక్స్
# మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల ముఖ వికాసాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేసేటందుకే రమ్యాలంకృతమైన 14 రంగులలో దొరుకుతున్నవి. శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు ఐటెక్స్ తిలకం చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు




**ఐటెక్స్**
38 సంవత్సరములుగ మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబొరేటరీస్ మద్రాసు 600 033

(గత సంచిక తరువాయి)

























[ఇంకా ఉంది]

# ఇప్పుడే కొనండి! మరింత ఆదా చెయ్యండి!

# 2 రూపాయల ఆదాచెయ్యండి

క్యాడ్‌బరీస్

# బోర్న్‌విటా

**500 గ్రాముల బోర్న్‌విటా రీఫిల్ ప్యాక్ కొనండి**




**అదే మేలైన లక్షణం,**
**అదే తాజాదనం, అదే మజా రుచి**

ఈ రీఫిల్ ప్యాక్ ప్రత్యేక నమూనాతో సీలు చేయబడటం వల్ల అప్పుడే ఫ్యాక్టరీలోంచి బయటి కొచ్చినప్పటి బోర్న్‌విటా తాజాదనం అలాగే ఉంటుందిక. దీన్ని తెరిచిన తర్వాత, మీరు చేయవలసిందల్లా, మీ ఖాళీ బోర్న్‌విటా డబ్బాలోకి దాన్ని వంచెయ్యడమే. మరి దీనిలో గల ప్రకృతిలోని మంచి లక్షణాలన్నీ అలాగే అట్టే వుండిపోతాయిక. మీ కుటుంబంలోని వారికి బోర్న్‌విటా యివ్వండి. దీని రుచి వారికి ఎంతో బాగా నచ్చుతుంది. త్వరపడండి. ప్రత్యేకంగా ఆదా చేసిపెట్టే 500 గ్రాముల మీ రీఫిల్ ప్యాక్‌ను తీసుకోండి. మీ బోర్న్‌విటా తాగండి.

త్వరపడండి!
సరుకు
పరిమితం!

క్యాడ్‌బరీస్

# బోర్న్‌విటా

దీన్లోని మంచి లక్షణాలన్నీ మీకోసం

OBM/7043/TL

సీరియల్

# నర్సింగ్‌హోం

— శ్రీరంగం —

'రాధాకృష్ణ తన్ను అలక్ష్యం చేస్తున్నాడు. మునుపటిమాదిరిగా తన్ను గౌరవించటంలేదు. తన అవసరాలనుకూడా అంత బాగా చూడడంలేదు. మూడు సార్లు డబ్బు అడిగితే ఏ వొకసారో యిస్తున్నాడు. వారం రోజుల క్రిందట తన ఆఖరు కూతురు పుట్టిందినం అంటూ పిలిస్తే, ఏదైనా బహుమానం యివ్వవలసివస్తుందని అసలు రాలేదు. రాను రాను తన్ను దూరమే చేసేటట్టున్నాడు. అందుకే యీ పక్షి చేతిలోంచి ఎగిరిపోయేలోపల తనింకో పక్షిని పట్టుకోవాలి. అలాంటి పక్షి ఎవరా?' అని ఆలోచిస్తున్నాడు ఎక్స్ కౌన్సిలర్.

అతనికి దగ్గరగా అందుబాటులో డాక్టర్ రమేష్ వొక్కడే కనిపిస్తున్నాడు. డా. రమేష్ ప్రాక్టీసు రోజురోజుకూ మెరుగవుతూంది. అతని దగ్గర ఎప్పుడూ వొక పదిమందిదాకా లైనులో ఉంటున్నారు. తను వీడ్ని మచ్చికచేసుకుని, కొంత లాగేస్తూ, రాధాకృష్ణకు వీడి ఉపయోగం చూపించి వాడినించి కూడా డబ్బు కొట్టేయాలి అనుకుని సిగరెట్టు గురించి జేబు తడుముకుని 'ఛీ, ఛీ యీ రాధాకృష్ణ తన సరదాలను అసలు మెయిన్‌టెయిన్ చేయటమేలేదు' అనుకుని బయటకి వచ్చేడు.

అయిదు నిముషాలు నడచి రమేష్ డిస్పెన్సరీకి వచ్చేడు. అప్పటికే జనం లైనులో ఉన్నారు. తను ఎరిగిన యిద్దరు ముగ్గురు తన్ను పలకరించేరు. లైనులో నిలబడి ఉన్నవాళ్లను తోసుకుంటూ లోనికి వెళ్లి 'నమస్కారం డాక్టర్' అన్నాడు ఎక్స్‌కౌన్సిలర్.

పేషంటును పరీక్ష చేస్తున్న రమేష్ తల ఎత్తి చూసి 'నమస్కారం' అని కూర్చోండి అని పేషంటును తిరిగి పరీక్ష చేయసాగేడు.

'ఏంటండీ డాక్టరుగారూ, మీతో ఎన్నాళ్లనించో వొచ్చి అన్ని సంగతులూ మాట్లాడుదాం అనుకుంటే ఏ రోజూ తీరికే చిక్కటంలేదు. 'డాక్టరుగారు ప్రాక్టీసు పెట్టి యిన్నాళ్ళు అయింది యిక్కడ! మనం అతన్ని కలవకపోవడం ఏంటి?' అని యీ రోజు గట్టిగా మనస్సున పట్టించుకుని వచ్చేనండీ!' అన్నాడు.

'నేను పేషంటును పరీక్ష చేస్తున్నాను. కాస్తసేపు మాట్లాడకండి' అని తిరిగి తన కేసు చూసుకోసాగేడు కొంచెం విసుగుతో రమేష్.

'వీడు గట్టిపిండమేనే! నాకు లొంగేటట్టులేడే' అనుకుని టేబిలుమీద ఉన్న ఎక్సర్‌సైజ్ పుస్తకం తీసేడు. అది రమేష్ పేషంట్ల రిజిష్టరు. అందులో పేషంటు పేరూ, వయస్సూ, వాళ్ళ

(గత సంచిక తరువాయి)

యిచ్చిన డబ్బూ ఉంటుంది. ఎక్స్‌కౌన్సిలర్ అలా పుస్తకం తిప్పబోయేడోలేదో రమేష్ వచ్చి, అతని చేతిలోంచి పుస్తకం లాక్కున్నంత పనిచేసి, 'మీరు నిలకడగా కూర్చోలేరా?' అంటూ మొహమాటం లేకుండ అడిగేడు.

'సారీ డాక్టర్' అన్నాడు ఎక్స్‌కౌన్సిలర్.

యింకో అయిదు నిముషాలు పరీక్షించి పేషంటుకు మందిచ్చి పంపించి 'చెప్పండి?' అన్నట్టు నిలబడ్డాడు రమేష్.

'ఏంటండీ, అంతసేపు పరీక్షించేరు. క్యాన్సరా' అన్నాడు కౌన్సిలర్. 'కాదు జలుబు' అని, చూడండీ! మీ పేరేంటో నాకు తెలియదు. మీరు ఎవరో నాకు తెలియదు, కాని నా దగ్గరకి వచ్చేవాళ్ళు ఎలా ఉండాలో నాకు తెలుసు. మొదటిది అలా నేను పేషంటును పరీక్ష చేస్తూంటే లోనికి రావడం నేను సహించను. రెండోది నేను పనిలో ఉన్నప్పుడు నన్ను డిస్టర్బ్‌చేసే పనికిమాలిన మాటల్ని మరీ సహించను. మూడోది నా వస్తువుల్ని ఏది నా అనుమతి లేకుండా తాకినా నేను ఓర్చుకోలేను. మీరు అంత పెద్దవారు — తలవెంట్రుకలు కూడా తెల్లబడిపోయేయి. ఇలానా ప్రవర్తిస్తారు' అంటూ ఆవేశంగా అన్నాడు.

'సారీ డాక్టర్' అని 'ఏంటో డాక్టర్ యీ కాలం కుర్రాళ్లకు ముక్కుమీదే ఉంటుంది కోపం పాతకాలంనాటివాళ్లు ఏంచేసినా ప్రతీదాన్నీ తప్పు పడ్తారు. పోన్లెండి. ఇది మీ రాజ్యం. మీరు ఎలా పాలించినా మేం పడివుండాల్సిందే తప్పుతుందా' అని 'డాక్టర్ ప్రాక్టీసు బాగానే ఉన్నట్టుందే' అన్నాడు.

'బాగానే ఉంది' అన్నాడు రమేష్.

డిస్పెన్సరీ అంతా వొకసారి చూసి 'డాక్టర్ యీ గోడలు ఏంటి చెప్పు? శుభ్రంగా సున్నం వేయించి తళతళమనేటట్టు చేసుకోవాలిగాని అలా సున్నం లేకుండా... నో... నో అదే రాధాకృష్ణ డిస్పెన్సరీ చూడండి. విమ్ వేసి తోమిన స్టీల్ పాత్రలా తళతళలాడుతూ ఉంటుంది. ఆ తలుపుకి రంగు ఊడిపోతూన్నా పట్టించుకోవటంలేదేంటి? డాక్టర్ ఆ టేబులు క్లాత్, అందులో క్లాత్ అంటూ ఏమయినా ఉందా చింకులు తప్ప. ఆ మిక్చర్ బాటిల్సు! వాటిమీద దుమ్మే! ఆ గోడమూలు చూడండి సాలెగూళ్ళు. ఇది ఎవ్వరూ పట్టించుకోకుండా విడిచేసిన అనాథలా ఉందిగాని, డాక్టరున్న డిస్పెన్సరీలాగుందా? డాక్టర్ నేను అంటున్నానని ఏం అనుకోకండి, యీ కాలంలో షో కావాలండీ! ఎంత షో ఉంటే అంత గొప్ప డాక్టరు. అది లేకపోతే తక్కువ డాక్టరు. మీకేందుకు — యీ క్లీనుక్కును త్రోవలో తెచ్చే పూచీ నాది. రేపు సున్నంవాళ్లనూ రంగువాళ్లనూ తెచ్చి మొదట సున్నం రంగులూ వేయించేస్తాను. తర్వాత... మీరు వొక కుర్రాణ్ణి పెట్టుకోవాలండీ చేతిక్రిందకు. మీరే తెరచుకుని, మీరే మిక్చర్ పోసి, మీరే అన్నీ చేస్తే — అందులో గౌరవం ఏం ఉంటుందండీ, చేతికిందకంటూ వొక కుర్రాడు వుండాలి. వాడు వచ్చినవాళ్లకు నెంబర్లు యిచ్చి కూర్చోపెట్టాలి, వొక నెంబరు తర్వాత మరొకణ్ణి లోనికి పంపించాలి. ఆ తర్వాత మీరు చెప్పిన మందులు కట్టి యివ్వాలి. అంతేగాని మీరే పేషంటుని లోనికి పిలిచి, కూర్చోబెట్టి... అదికాదు డాక్టర్! ప్రాక్టీసు అంటే. ఇంకో సంగతి. అడగందే అమ్మయినా అన్నం పెట్టదు, వేలు వంకరపెడ్తేనే గాని వెన్న రాదు. అలానే మీ డాక్టర్లుకూడా!

**జరిగిన కథ — 8 :** డాక్టర్ రాజా ఎం. డి. లో గోల్డ్‌మెడల్ సంపాయించుకొంటాడు. ఇప్పుడు అతను తన కుటుంబాన్ని మోయవలసి వున్నది. రాజా, మంజుల ఇరువురూ ఒకరి నొకరు పరస్పరం ప్రేమించుకొంటారు. అతను ప్రాక్టీసుపెట్టి, కొంత ఆర్థికస్తోమత చిక్కిన తరువాత పెళ్లిచేసుకోవాలని నిర్ణయించుకొంటారు. డా. విశ్వం సహాయంతో ప్రాక్టీసు పెడతాడు రాజా. ఎం.బి.బి.యస్. పూర్తి కాకుండానే కొంత డబ్బు ఖర్చుపెట్టి ఆర్. ఎం. పి. డిగ్రీ తీసుకొని డిస్పెన్సరీ తెరుస్తాడు డా. రాధాకృష్ణ. అతను తన భార్య సుగుణకు కూడా ఓ. ఆర్. ఎం. పి. డిగ్రీ సంపాయించి ఆమెను తన డిస్పెన్సరీలోనే లేడీడాక్టర్‌గా వేసుకొంటాడు. డాక్టర్ విశ్వం దగ్గరకు ఓ అమ్మాయి వచ్చి, మీరు లోగడ నా భర్తకు చేసిన 'వేసక్టమీ' ఆపరేషన్ ఫెయిల్ అయిందని అతనితో చెప్పమని, ఫీజు క్రింద తన గాజులు తీసి యిస్తుండగా, విశ్వానికి అహం అడ్డురాగా బయటకు పొమ్మంటాడు. ఆమె పోతుండగా భర్త పేరు అడిగి తెలుసుకొని ఆమెకు సహాయం చేస్తాడు. డా. రాధాకృష్ణ ఎక్స్‌కౌన్సిలర్ సహాయంతో ఓ మందులషాపు పెట్టి, అందులో చదువూ సంధ్యా లేకుండా తిరుగుతున్న తన తమ్ములకు దొంగ సర్టిఫికేట్‌లు సంపాయించి వాళ్లను అందులో వుంచుతాడు. డా. విశ్వం నర్సింగ్‌హోం మేనేజర్ జబ్బుచేసి వెళ్లిపోతే, అతను వచ్చేవరకు ఆ సీటు డాక్టర్ రాజాకు అప్పగించుతాడు విశ్వం. అస్తవ్యస్తంగా వున్న ఆ నర్సింగ్‌హోంను చూసి, దానిని ఓ దారికి తేవాలని ప్రయత్నిస్తుంటాడు రాజా. ఆసుపత్రిలో తన పని అయిపోయిన తర్వాత డా. విశ్వం నర్సింగ్‌హోంలో అతనికి అసిస్టెంట్‌గా పని చేస్తుంటాడు డా. శేఖర్. వళ్లు కాలిపోయిన విశ్వం స్టూడెంట్ డా. ఉమను అతని నర్సింగ్‌హోంలో చేరుస్తారు ఆమె అప్తులు. ఉమ కోర్కెపై ఆమెకు ఏ విధమైన ట్రీట్‌మెంట్ చేయకుండా ఆమె భర్త వచ్చేవరకూ ఉంచుతారు విశ్వం, శేఖర్. అతను వచ్చిన తర్వాత ఆ భార్యాభర్తలిరువురు కన్నుమూస్తారు.

ఇంతసేపూ ఆ పేషంటుని పరీక్షించేరా, చివరికి నీకు జబ్బు ఏంలేదు జలుబు అన్నారనుకోండి, మీరిచ్చే బిళ్లలకంటే, మా ఆవిడ యిచ్చే మిరియాల కషాయమే బాగా పనిచేస్తుంది — అని పేషంటు థాంక్స్ పడేసి వెళ్తాడు. అదే ఆ జలుబునే మీ పరిభాషలో కారేజా అని చెప్పండి. అమ్మబాబోయ్ కలరా అన్నట్టు వినబడి మీ పాదాలమీద పడ్తాడు. ఏం భయంలేదోయ్ చెవిటి సన్యాసీ! నేను అభయం యిస్తున్నాను. నీకూ నీ ప్రాణానికీ నా ప్రాణం అడ్డు అన్నారనుకోండి వాడు దోసిళ్ళతో డబ్బు తెచ్చి మీకు పోస్తాడు. ఇలాంటి టిప్స్ మీకు నేను యిచ్చేనంటే మీరు అందర్నీ మించిపోతారు. ప్రాక్టీసు పితామహులు అయికూర్చుంటారు.' ఈ లెక్చరు' యిలా సాగుతూనే ఉంది. బయటినించి ఎవరో కర్టను తొలగించి లోనికి చూసేరు.

అప్పటిదాకా ఏం మాట్లాడని రమేష్ ఎక్స్‌కౌన్సిలర్ దగ్గరకు వచ్చి అతని జబ్బ పట్టుకుని లేవనెత్తి 'డాక్టర్ యిదేంటి' అని అంటున్నా వినకుండా బయటదాకా తీసుకొచ్చి 'గెట్ అవుట్, యీసారి జబ్బతో పోనిచ్చేను. మరొకసారి నా డిస్పెన్సరీలో కాలు పెట్టేవా జబ్బకంటే మీదకు పోవలసివస్తుంది' అంటూ కఠినంగా అన్నాడు.

'డాక్టర్ నామీదే చేయివేస్తావా! నీకు అంత ధైర్యమా? నీవు యిక యీ బస్తీలో ఉండే రోజులు అయిపోయేయి. తొందరలో నీ బోర్డు నీ డిస్పెన్సరీ ఊడపీకించకపోతే...'

రమేష్ అప్పటికే లోనికి వెళ్లిపోయేడు.

కొరివిలామండుతూ నడవసాగేడు ఎక్స్‌కౌన్సిలర్.

* * *

ఉమ చనిపోయి అప్పుడే రెండు రోజులు దాటింది. విశ్వం, శేఖర్, రాజాని ఏదో నిర్లిప్తత ఆవహించింది. ఆమే ఆమె భర్తా యిద్దరూ ఆ గదిలో చనిపోయినప్పటినించీ ముగ్గురి మనోఫలకాల మీదా రూ నెం. వొకటి, అందులో మెడదాకా బెడ్‌షీట్‌తో కప్పుకుని కనులు మూసుకుని పడుకుని భర్త గురించి వేచివున్న ఉమ, తర్వాత భర్త అడుగుల చప్పుడుకు కనులు తెరచి చూసి తృప్తిగా కళ్లు మూసుకున్న ఉమ, ఫీలింగ్సు అంటూ లేకుండా బిర్రబిగదీసుకుపోయిన ఆమె భర్త — వొక దృశ్యం తర్వాత మరో దృశ్యం మార్చి మార్చి కనపడుతూంది. శేఖర్ వీటికి అంత ప్రాముఖ్యత యివ్వకపోయినా వొక్కటిమటుకు అతని వైద్య విజ్ఞానం సమర్థించలేకపోతూంది. అదే ఆమె నొప్పిలేని స్థితి. అనెస్థీషియా కూడా పనిచేయలేని ఆ పరిస్థితిని ఆమె ఏ బాధా లేకుండా, అంత ఆనందంతో భర్త గురించి నిరీక్షిస్తూ ఎలా గడపగలదు? అతని చూపు గురించీ ప్రాణాలు ఆపి ఉంచినట్టు, అతన్ని చూడగానే ఎలా విడువగలదు? తర్కిస్తున్నకొద్దీ అంతా అపహాస్యంగా తయారవుతున్నాయి తన ఆలోచనలు. ఉమ అంది తన్ను వొక తపస్వి అంటూ. కాని తన తపస్సు, శారీరకంగా బాధంటూ లేనప్పుడే! అదే శరీరంలోగాని చిన్న బాధంటూ ఉంటే, తను ఉమలా మరచిపోగలడా? అంటే తను శారీరకంగా బాధ సృష్టించుకుంటేనేగాని తెలియదు.



ఇది యిప్పుడు కాకపోయినా ఎప్పుడయినా పరీక్ష చేసుకోవాలి.

డాక్టర్ రాజా ఆలోచనలు మరో రకంగా ఉన్నాయి. ఉమా ఆమె భర్తలా కలసిపోవాలి తనూ మంజూ. ఎల్లప్పుడూ వొక్కటి కావడం అంటే అదేనేమో! తనకూ మంజూ అలానే ప్రేమించాలని ఉంది. తమిద్దరి జీవితం వొక్క మాటమీదే గడవాలని ఉంది. కాని పెళ్లి కానంతసేపూ ఊహించడం, సాధ్యమేమోగాని పెళ్లి అయింతరువాత అలా బ్రతకడం సాధ్యమా? తనూ మంజూ యిద్దరూ మేడ్ ఫర్ యీచ్ అదర్ అనుకున్నాడు యిన్నాళ్లు. కాని యీ రోజే తనకు తెలిసింది తనకంటె యింకా బాగా మేడ్ ఫర్ యీచ్ అదర్ జంటలు చాలా ఉన్నాయనీ. తన యీ భావాల్నే విస్తరిస్తూ మంజూకు ఉత్తరం రాసేడు. ఆమె తిరిగి ఏం జవాబు రాస్తుందో? అయినా యీమధ్య తను మంజూకు కాలమే యివ్వటంలేదు. వొచ్చిన కొత్తలో రోజూ రాత్రి పడుకోబోయేముందు వొక పది నిముషాలు ఆమెతో ఉన్నట్టే ఊహిస్తూ అనుభవించేవాడు. కాని రాను రాను బాధ్యతలూ, పనులూ, ఆలోచనలూ ఎక్కువవుతున్నకొద్దీ ఆమెకు అసలు కాలమే యివ్వటంలేదు. అలాంటి తను ఉమ జంటతో పోల్చుకుంటున్నాడు. తనకు నవ్వొచ్చింది.

డాక్టర్ విశ్వం తన కుర్చీలో కూర్చొని మిషనులా పేషంట్లను చూస్తూ, వాళ్లతో మాట్లాడుతూ మరోప్రక్క ఆలోచిస్తున్నాడు ఉమ తన్ను ప్రశ్న అడిగినప్పటినించీ? తన జీవితంలో అందమయిన అనుభూతి వొక్కటి అంటూ ఉందా? అని. ఉమ గంటసేపు ఆలోచించుకోవాలని అంది. కాని తను ఉమ చనిపోయినప్పటినించీ ఆలోచిస్తున్నాడు. తన్ను తాను మైమరచి ఆనందించిన వొక్క సంఘటన అంటూ యిప్పటిదాకా తట్టనేలేదు. తనకు ఎప్పుడూ ఏదో తక్కువ. అది సాధిద్దామనే ప్రయత్నంలోనే యింకా ఉన్నాడు. తన తండ్రి వొక వంటవాడు. అందరి యిళ్లలో సంతర్పణ వంటలు చేసేవాడు. వరసగా ఏడుగురు పిల్లల్ని కన్నాడు.









ఏడో కాన్పులో తల్లి పోయింది కాబట్టి అతని సంతానం ఏడు మాత్రమే అయింది. అదే ఆమె బ్రతికి ఉంటే? అలా కంటూనే ఉండేవాడు కాబోలు.

పిల్లలు చిన్నగా ఉన్నప్పుడే తండ్రికి పక్షవాతం వొచ్చి కాలు చెయ్యీ చచ్చుబడింది. వంటవాడికి అన్నం పెట్టేదీ కాలూ చెయ్యీ! అదే లేకపోతే? అందుకే తండ్రి వంటలు తను తీసుకున్నాడు. వొకప్రక్క వంటలు చేస్తూ మరోప్రక్క చదువుకున్నాడు. తన నలుగురు తమ్ముళ్లనూ, యిద్దరు చెల్లెళ్లనూ వొక చిన్న టీమ్‌గా తయారుచేసి, వాళ్లతో పెద్ద పెద్ద వంటలే చేపట్టేవాడు. తను తొమ్మిదిదాకా అక్కడే వుండి — తర్వాత పనివాళ్లకు అప్పచెప్పి కాలేజీలో చేరేడు. ఇంటర్‌లో ఫస్ట్‌క్లాస్ వొచ్చింది. మెడిసన్‌లో చేరేడు. తను ఎంబిబియస్ డిగ్రీ తీసుకునేదాకా వంటలు సూపర్‌వైజ్ చేసేడు. ఎంయస్‌లో చేరింతరువాత అది మానేసేడు. తన తమ్ముళ్లే చూసుకొనేవారు. ఎంతో కష్టపడి ఎం. యస్. పూర్తిచేసేడు. చిన్నప్పటినించీ వంటల జీవితం కావడంనించి టైముకి భోజనంలేక, కూరలు కొనే స్తోమతలేక పచ్చళ్లమీదే బ్రతకడంనించి తను మెడిసిన్‌లో చేరగానే గ్యాస్ట్రిక్ అల్సర్ మొదలయింది. దాన్ని తన దరిద్ర జీవితం పెంపొందించింది. ఎం. యస్. పూర్తిచేసేటప్పటికి తను పెరుగు అన్నం, పాలూ అన్నం మాత్రమే తినగలిగేవాడు. పులుపూ, కారం, గడ్డకూరలు అసలు వొదిలేసేడు.

డిగ్రీ తీసుకున్నా, తనకు వొక మంచి చొక్కా వేసుకునే యోగమే లేదు. కుట్ల చొక్కాలూ, పాతకాలంనాటి పాంట్లూ. తను అసిస్టెంటుగా చేరింతరువాత చాలా కష్టపడ్డాడు — ప్రయివేట్ ప్రాక్టీసు గురించి. సైకిలుమీద యింటింటికీ వెళ్లి యింజక్షను యిచ్చేవాడు. తనకు వొక రోజు వొక స్వంత కారూ, యిల్లూ బ్యాంకీలో డబ్బు యివన్నీ ఉంటాయని ఎన్నో కలలుగని — ఆ ఆశల కలలతోనే పొదుపుగా వచ్చింది ఖర్చుపెట్టి, వోపికతో పేషంట్లకు నచ్చచెప్పి — యింత వోపికగల డాక్టరు లేడు అన్న పేరు తెచ్చుకున్నాడు. తన ప్రాక్టీసు కొద్దిగా పికప్ అయేటప్పటికి ట్రాన్స్‌ఫర్ అంటూ వచ్చేది. దాన్ని కాన్సిలు చేసుకునేందుకు కూడపెట్టింది ఖర్చుపెట్టవలసివచ్చేది. అలా కూడపెట్టి ఖర్చుపెట్టి, హాస్పిటలు మారినా,

## నర్సింగ్ హోం

పట్నం విడవకుండా పట్నం విడిచినా చాలా దూరం పోకుండా ప్రాక్టీసు కాపాడుకుంటూ వచ్చి — మంచి హస్తవాసి అన్న నమ్మకం సంపాయించేడు పేషంట్లలో. తర్వాత తన దశ తిరిగింది. తన తమ్ముళ్లచేత వంట పని మానిపించి వొక్కొక్కడికీ అయిదెకరాల పొలం కొని యిచ్చేడు. చెల్లెళ్లకు, వీలయినంతవరకూ మంచి సంబంధాలు తెచ్చి పెళ్లి చేసేడు. ఇప్పుడు వాళ్లంతా సుఖంగా వున్నారు. తనే సంవత్సరాని కొకసారి వాళ్లందర్నీ చూసి బట్టలు పెట్టి వస్తూంటాడు. వాళ్లమటుకు తన దగ్గరికి అసలు రారు. ఏ మూడేళ్ల కొకసారి వచ్చినా ఒక అరగంట కంటె ఎక్కువ వుండరు. వాళ్లకొక యిన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు. అదీకాకుండా తన భార్యవాళ్లను ఎక్కడ అవమానపరుస్తుందో అన్న భయం.

ఇన్నేళ్ల తన జీవితంలో రేపటిగురించే పని చేస్తూన్నాడు. అది అపుదాం అనేటప్పటికి, జీవితం తన స్వాధీనంలోంచి వెళ్లిపోయింది. అందుకే వొక మరలా తయారయేడు. తను యిదివిడిస్తే — దేనికీ పనికిరాడు. ఒక కంపెనీనీ ఎంజాయ్ చేయలేడు. పిల్లలతో సరదాగా మాట్లాడలేడు. సినిమా చూసి ఆనందించలేడు. తను చేయగలిగిందల్లా ప్రొద్దస్తమానం వోపికగా కేసుల్ని చూడడం. ఆపరేషన్లు చేయడం. తను కంపెనీ యివ్వగలడు. జోక్ చేయగలడు. అది ఎదుటివాళ్ళు ఆనందపడాలనీ! అదే తన లక్ష్యం! తను నవ్వగలడు — ఎదుటివాళ్లకు తను నవ్వగలడని చూపించేందుకు. అది పెదాలమీద పుడుతుంది. అక్కడే అంతం అవుతుంది. అంతేగాని తను యిప్పటిదాకా మనస్సునించి నవ్వే ఎరుగడు. ఈ రోజు తను వెనక్కి తిరిగిచూస్తే జీవితం ఖాళీగా అనిపిస్తుంది. తన బాల్యం యివాళ్ళకి ఒక్క క్షణంలో మారిపోయినట్టుంది. రేపేగాని తన సర్జరీ చేసే యీ చేతికి ఏమైనా అయిందంటే — అప్పుడు తన కాలమే అసలు గడవదు. ఆ రోజు తనకు తెలుస్తుంది తను జీవితంలో పోగొట్టుకుం దేంటో?... తన ఆలోచనలతో కొట్టుకుపోతూన్న విశ్వాన్ని... 'సార్' అంటూ ఎర్సు పరిగెత్తుకుంటూ వచ్చి "మీరు వారం రోజులు క్రితం జీ. జె. చేసిన కేసు కుట్లు విడిపోయి పేగులు అన్నీ బయటికి వచ్చేసేయి సార్' అంటూ రొప్పుతూ చెప్పింది.

విశ్వం బలంగా వెనకనించి తోసినట్లు లేచి పరిగెత్తేడు, నర్సింగ్‌హోంలోకి. అప్పటికే చిన్న పేగుల్ని చేతుల్లో పట్టుకుని కుర్చీలో కూర్చున్నాడు ఆ పేషంటు. అతని ముఖం అంతా చెమటలో తడిసిపోయి ఉంది. ఆ నర్సింగ్‌హోంలోని వాళ్లంతా భయంకరంగా కళ్ళు పెద్దవి చేసుకుని చేతులనిండా పేగుల్ని ఉంచుకున్న అతన్ని చూస్తూ చలనంలేని బొమ్మల్లా వున్నారు.

విశ్వం పేషంటుని అలా చూస్తూ కంగారు పడకుండా, తన సహజమైన శాంతస్వరంలో 'సిస్టర్! స్ట్రెచ్చర్ తెచ్చి పేషంటును దానిమీద పడుకోబెట్టండి. నేను డ్రస్ మార్చుకుని ధియేటర్‌లోకి వస్తాను. తర్వాత సూచర్లు వేద్దాం' అని అక్కడనించి బయలుదేరబోతూ 'విరోచనం కాలేదని ముక్కేవేంటి?' అన్నాడు. 'అవును' అన్నట్లు తలూపేడు పేషంటు. 'మలబద్ధంగా వుంటే మందు వేసుకో! ముక్కకు అని నేను చెప్పినా వినలేదు నువ్వు. ఇప్పుడు తెల్సిందా ఎందుకు ముక్కవద్దన్నానో?' అన్నాడు.

'తెల్సింది' అన్నట్టు తలూపేడు పేషంటు.

విశ్వం బట్టలు మార్చుకోసాగేడు ధియేటర్

## అభినవ విశ్వకర్మలం

ప్రజా పనుల శాఖలకు
పంచ ప్రాణాలు మేము
శాతాల నిష్పత్తిని
అనవరతం పాటిస్తాం.
గోడ కూలి, కప్పు విరిగి
గోదున ప్రజ ఏడుస్తున్నా
ధృఢంగా ఉండగలం.
విరిగే జాతికి
కూలే వంతెనలు కట్టే
అభినవ విశ్వకర్మలం
నిమిత్త మాత్రులం
నిష్కామ యోగులం.

— డి. వి. సుబ్బారావు

సుందరాంగుల
సుందరస్వప్నాలకు
సౌందర్యరూపకల్పన -

# రాజ్‌కమల్

## చీరలు

అన్ని ముఖ్య షోరూంలలో
లభించును




# RAJKAMAL



మాన్యుఫాక్చరర్స్
శ్రీ సీతారాం డ్రైయింగ్ అండ్
ప్రింటింగ్ మిల్స్,
ప్రై. లిమిటెడ్, బొంబాయి-2




BREEZE

యాంటీ రూంలో. అతనికి తను హవుస్ సర్జన్‌గా ఉన్నప్పుడు జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది. అప్పుడు తనతో, ఫెయిల్ అయి ఫెయిల్ అయి పరీక్షాధికారులు విసుగొచ్చి పాస్ చేసిన ఒక హవుస్ సర్జను వున్నాడు. ఆ రోజు పొద్దున్న బాస్ దూరం నించి -- ఆ పేషంటు సూచర్లు తీయండి మూర్తి గారూ అన్నాడు.

మూర్తి సీజరూ, ఫోర్‌సెప్సూ తీసికెళ్లి కుట్లు ఊడదీసి లేవబోతూంటే వార్డు రవుండ్స్‌కి వచ్చిన బాస్ 'ఏంటి చేస్తున్నావు?' అంటూ అడిగేడు.

'అదేనండీ సూచర్లు తీసేసేను' అన్నాడు మూర్తి.

'ఇది మొన్న ఆపరేట్‌చేసిన కేసయ్యా! మూడో రోజే కుట్లు తీసేసేస్తే! వాడి కడుపు విచ్చుకు పోతుంది' అని 'అయినా నువ్వే మొద్దులాగున్నావు. కుట్లు తీయి అంటే గుడ్డెద్దు చేనులో పడ్డట్టు ఎదురుగుండా ఎవరు కనపడితేవాళ్లకే తీసేయడమేనా' ప్రక్క పేషంటుకు తియ్యి అంటే ఆ పేషంటు బాత్‌రూం కెళ్లాడనీ నీకు కనపడ్డ వాడికి తీసేస్తావా' అంటూ తిట్టి వెంటనే బాండేజీ తెప్పించి కడుపు చుట్టూ గట్టిగా కట్టి, కదలకుండా నాల్గు రోజులు పడుకోమన్నాడు బాస్ ఆ పేషంటుని.

తర్వాత మూర్తికి ఏం అయినా చెప్పాలంటే అందరూ భయపడేవాళ్లు. బట్టలు మార్చుకోగానే థియేటర్‌లోకి వెళ్లిపోయేడు విశ్వం.

* * *

డాక్టర్ రాజా తన ఎదురుగుండా ఉన్న కుర్రాణ్ణి చూసేడు. పై పెదవిమీద చర్మం నల్లగా అసహ్యంగా ఉంది. గడ్డం కూడా అసహ్యంగా ఉంది. ఆ కుర్రాడు ఆడపిల్లలా సిగ్గుపడుతూ తల ఒంచుకుని కూర్చున్నాడు. ఆ కుర్రాడి ప్రక్కన వాళ్ల అమ్మ చాలా దిగులుగా నిలుచుని ఉంది.

'నీపేరేంటి?' అన్నాడు డాక్టర్ రాజా.

'రవి' అంటూ తలవొంచుకుని సిగ్గుపడుతూన్నట్టు జవాబు చెప్పేడు.

'ఏంటి నీ బాధ' అంటూ అడిగేడు.

'అమ్మని అడగండీ!' అన్నాడు రవి.

'మీ అమ్మ చెప్పింది, నీకు ఆడపిల్లగనే భావన ఉందనీ! నిజమేనా?'

తలూపేడు.

'నీకెందుకు అలాంటి భావన కలిగిందో చెప్పగలవా?'

'ఏంటో నాకు చిన్నప్పటినించీ వంట అన్నా, ముగ్గులన్నా యిష్టం. యింట్లో పనులన్నీ చేయాలంటే చాలా సరదాగా ఉండేది. చెమ్మచెక్క ఆట దాగుడుమూతలూ ఇవంటే నాకు బాగునిపించేవి. నాకు ఆడపిల్లలతో మాట్లాడుతూంటేనే వా వాళ్లతో మాట్లాడుతూన్నట్టుండేది. నాకు ఇవి ఆడపిల్లలక్షణాలు అంటూ ఆ మొగవాడు ఆడపిల్లగా మారిన యింటర్వ్యూ చదివేదాకా తెలియదు. తర్వాత నేనే ఆ మాగజైన్‌వారికి ఉత్తరం రాసి ఆ పిల్ల ఎడ్రసు సంపాయించేను. ఆమెకు ఉత్తరం రాసేను. నాకు జవాబు వచ్చింది. ఆమెకూ తనలాగే అనిపిస్తూండేదనీ – తను ఆపరేషను చేసుకుని సెక్సు మార్చుకుందనీ! తర్వాత నేను ఆమెని కలిసేను ఎడ్యుకేషనల్ టూర్ అంటూ బయటికి వెళ్లినప్పుడు' అంటూ తల్లి చెప్పినదంతా వినిపించేడు.

డాక్టర్ రాజా, ''ఏంటి ముఖం అలా నల్లగా తయారయిందని'' అడిగేడు.

'హెయిర్ రిమూవర్ వాడుతున్నాను సార్' అన్నాడు రవి.

వాళ్ల తల్లిని బయటికి పంపించి పూర్తిగా పరీక్షచేసి రవితో 'చూడు రవీ! నీవు సంపూర్ణంగా మొగాడివి. ఇందులో అనుమానం అంటూ అసలు ఏమీలేదు. నిన్ను ఏ ఆపరేషను ఎవరు చేసినా ఆడవానివి మాత్రం కాలేవు.'

'ఆమెకూ డాక్టర్లు ఇలానే అన్నారట! తర్వాత ఆమె పట్టుబట్టి మార్పించుకుంది సర్జరీ చేసుకుని.'

'రవీ! ఆ కేసు వేరు, ఈ కేసు వేరు.'

'వేరు ఎలా అవుతుందిసార్! మొదట ఆమెకూ నాలానే యివన్నీ ఉండేవి. అవి తీసేసుకున్న తర్వాత ఆమె ... ఆమెగా మారింది.'

'ఆమె మొదటినించీ ఆమే. అతను కాదు ఆడవాళ్లకుండవలసినవన్నీ అంతర్గతంగా ఉండేవి. దాన్ని సర్జరీతో బయటికి తెచ్చేరు తప్ప, క్రొత్తగా ఏమీ తయారుచేయలేదు.'

'మా అమ్మ నన్ను వొప్పించమని ప్రాధేయపడింది. అందుకే మీరు యింతగా చెబుతున్నారు. మీరు ఎంత చెప్పినా నాకు నమ్మకం ఉంది సార్, నేను ఆడదాన్ననే. నేను ఆడపిల్లనయి...

అందరి ఆడపిల్లల్లా ఎవరినేనా పెళ్లి చేసుకుని పిల్లల్ని కని తల్లిని కావాలని వుంది సార్ !'

'పోనీ! నీకు అలాంటి కోరికే ఉందనుకో! ఆపరేషను చేసి నిన్ను ఆడపిల్లని చేసినా యిప్పటిదాకా మొగగా పెరిగిన నిన్ను పెళ్లి చేసుకొనేందుకు ముందుకు ఎవరు వస్తార .'

'ఎందుకు రారు సార్ ! తప్పకుండా వస్తారు. అయినా అది తర్వాత సంగతి. ముందు నన్ను ఆడపిల్లగా చేసేయండి.'

'రవీ ! నువ్వు చేసేయండీ అంటే చేసేయడానికి యిదేం బొమ్మనుకున్నావా! ఇది రక్తం మాంసంతో ఉన్న శరీరం. దీనికీ కొన్ని హద్దులు అంటూ వుంటాయి. ఎంత పెద్ద డాక్టరయినా ఆ హద్దుల్ని దాటలేరు.'

'నేను హద్దుల్ని దాటమనటంలేదు సార్ ! మీ డ్యూటీ మిమ్మల్ని చేయమంటున్నాను. అంతేకాని పక్షపాతంతో మా అమ్మని మన్నించవద్దంటున్నాను.'

'పోనీ నా మాటమీద నమ్మకం లేకపోతే డాక్టర్ విశ్వంగారిని అడుగు.'

'ఆయన్నీ అడుగుతాను.' అని అంటూడగానే శేఖర్ నర్సింగ్‌హోంలోకి వెళుతూ కనిపించేడు. 'డాక్టర్ శేఖర్' అంటూ పిలిచి అతను లోనికి రాగానే 'వీరు డాక్టర్ శేఖర్! సర్జన్ ! వీరికి సర్జరీలో తెలియని విషయం అంటూ లేదు. అడుగు' అంటూ కేసు గురించి సంక్షిప్తంగా చెప్పి 'మీరు పరీక్షించండి డాక్టర్ !' అన్నాడు రాజా.

శేఖర్ అయిదు నిముషాలు పరీక్షించి 'నీకు ఆపరేషన్ అసంభవమోయ్ రవీ !' అన్నాడు.

'సర్జన్ కూడా అసంభవం అన్నారంటే చిన్నప్పుడు మా అమ్మ, నాన్నా నామీద అంత అద్భుతంగా ఆపరేషన్ చేయించి నాకు మొగపిల్లాడి రూపం వచ్చేటట్టు చేసేరన్నమాట. మా అమ్మతో ఎన్నోసార్లు అమ్మా నాకు చిన్నతనంలో ఆపరేషన్ ఏం అయినా చేయించేరా అంటే అసలు వొప్పుకోదే' అని శేఖర్‌తో 'డాక్టర్ మీరు మళ్లా పరీక్షించి చూడండి. నేను చిన్నగా ఉన్నప్పుడు ఆపరేషను చేసిన గుర్తులు ఏమయినా కనిపిస్తాయేమో ?' అన్నాడు.

తిరిగి శేఖర్ పరీక్షించి 'అవేం లేవోయ్ అన్నీ నీ అనుమానాలు తప్పితే !'

'మీరుకూడా డాక్టర్ రాజాలాగే మాట్లాడు తున్నారు. అంటే మా అమ్మ మిమ్మల్నికూడా కలిసిందన్నమాట. డాక్టర్ ఇది నా జీవిత సమస్య. మీరు మా అమ్మ కన్నీళ్లకు లొంగిపోయి నాకు అన్యాయం చేయకండి సార్' అన్నాడు.

రాజా రవికి నచ్చచెప్పబోతూంటే శేఖర్ వొద్దు అన్నట్టు కళ్లతోనే వారించి 'చూడు రవీ ! నువ్వు పదిహేను రోజుల తర్వాత వొకసారి కనిపించు. అప్పటికి నేను లేటెస్టు జెనరల్స్ తిరగేసి క్రొత్తగా ఆపరేషన్లు వచ్చేయేమో చూస్తాను' అన్నాడు శేఖర్.

రవి సంతోషంతో కుర్చీలోంచి లేస్తూ 'థాంక్స్ డాక్టర్ ! మీరు ఒక్కరయినా నామీద ఇంత యింటరెస్టు చూపేందుకు సిద్ధం అయేరు. థాంక్స్ ఎగేన్. నేను పదిహేను రోజుల తర్వాత మిమ్మల్ని వచ్చి కలుస్తాను' అంటూ లేచి నమస్కారం చేసి వెళ్లిపోయేడు.

రవి వెళ్లిపోగానే శేఖర్ని రాజా ప్రశ్నార్థకంగా చూసేడు.

'సారీ డాక్టర్ రాజా ! నేను అలా చెప్పవలసి వచ్చింది. లేకపోతే అతను మన దగ్గరికి అసలు రాడు. ఇదో సైకోసిస్ డాక్టర్. దీన్ని ట్రాన్స్ పర్సిజమ్ ట్రాన్స్ సెక్సువాలిటీ అంటారు. ఈ కుర్రాడి మనసులో యితని చిన్నతనంలో ఏదో అభూతమైన ఆపరేషన్ చేసి యితని సెక్సు మార్చేసేరనే నమ్మకం ఉంది. ఇది తన సెక్సు కాదనే బలమైన ఫీలింగు.

మనం ఏం చేసినా లాభంలేదు. ఇలాంటివాళ్ళ వాళ్ల సెక్సు ఆర్గన్స్‌ని హేట్ చేస్తారు. దాన్ని తీసేయమని తిరిగి తిరిగి కోరుతూంటారు. ఒకవేళ మనం వీళ్ల బాధపడలేక పురుషాంగాల్ని తీసేసి ఈస్ట్రోజన్ యిచ్చి బ్రెస్టు పెంచినా, యింకా వాళ్లకు తృప్తి ఉండదు. అసలు అలాంటి పని చేయడం చట్టరీత్యా నేరం. మహాఘోరమూ కూడా.

# ఏకాదశ గ్రహం

ఈడొచ్చిన ఆడపిల్లకి
'మగని' ఎన్నిక ఆచారం
యౌవన వతులైన పదవి దుహితలకు
దేశమాత జామాతలను ఎంచడం గ్రహచారం
ఇంటల్లుడు ఆడపిల్లకే మొగుడు
దేశంలో అందరికీ
రాజకీయ నాయకుడు మొగుడు
అరిగించుకొనే అల్లుడికి
ఏడాది మనుగుడువు
కాని ఎంత తిన్నా నాయకుడికి
రోజూ పరగిడుపు
దశమ గ్రహానికి 'దశ' మారే నాటికైనా
కాళ్ళుడుగుతాయి
ఏకాదశ గ్రహం ఎన్నేళ్ళయినా
పదవి కన్నె కోసం (ప్ర) దక్షిణ నాయకుడే !

— 'పైడిపాల'

నానికి సిద్ధపడి ఆపరేషను చేసి, ప్లాస్టిక్ సర్జరీలో ఆడవాళ్ల ఇంద్రియాల్ని కల్పించినా, యింకా సర్జరీ చేయండి, అంటూ ప్రాణం తోడేస్తారు. వాళ్లకు ఎంత సర్జరీ చేసినా యింకా తక్కువే. డాక్టరు సరిగ్గా చేయలేకపోయాడు అనుకుంటారే తప్ప మరో విధంగా తలపోయరు. వీళ్ల జీవితాంతం యిలా అసంతృప్తితో గడిపి, చివరికి ఆత్మహత్య లాంటిదేదో తలపెట్టి జీవితం అంతం చేసుకుంటారు.'

డాక్టర్ రాజా 'మరి రవి జీవితం అలానే తయారవుతుందా ?' అంటూ అడిగేడు.

'చెప్పలేం. కాని యీ కుర్రాడు మాత్రం అప్పుడప్పుడు సివియర్ డిప్రషన్‌కి లోనౌతూంటాడు. అలాంటప్పుడు ఏ అఘాయిత్యం చేయకుండా కాపాడు కోవలసిన బాధ్యత తల్లిదండ్రులమీద ఉంటుంది.'

'అయితే ఏం చేయమంటారు ?'

'ఏంలేదు, కొంతకాలం యిలానే కుర్రాడ్ని మభ్యపెట్టడమే ! తర్వాత ... అతనికే విసుగొచ్చి డాక్టర్ని మార్చుకుంటాడు.'

'పోనీ సైకియాట్రిష్టు దగ్గరికి పంపిస్తే.'

'ఎవ్వరి దగ్గరికి పంపించినా పరిణామం అదే.'

ఇంతలో అటెండరు వచ్చి 'సార్ రూమ్ నెంబరు వన్‌లో ఆమె తిరిగినొప్పి అంటూ వచ్చేసింది. ఆమె నొప్పితో మెలికలు తిరిగిపోతూంది. డాక్టర్ విశ్వంగారు బరస్టు అబ్‌డామిన్‌కి సూచర్లు వేస్తున్నారు. మీరు వస్తే మీకు చూపించమన్నారు' అన్నాడు.

శేఖర్ లేస్తూంటే 'నేను కూడా వస్తాను డాక్టర్' అంటూ అతని వెంబడి నడిచేడు రాజా.

రూం నెంబరు వన్ పేషంటు సుమిత్ర, నన్నపాటివాళ్ల కన్పించే బట్టల్లో స్ట్రెచ్చర్‌మీద యిటూ అటూ పొర్లాడుతూంది. ఆమె భర్త



# జలుబు లక్షణాలలో మిమ్మల్ని చికాకు పెడుతూన్నది ఏది?




## జలుబూ, రొంపావల్ల వచ్చే అస్వస్థతలన్నిటి కోసం తీసుకోండి

# డబుల్ పవర్ విక్స్ ఏక్షన్-500

జలుబు పట్టిందంటే ఒకటి కాదు పది చికాకులు. మీరిక నీరస పడిపోతారు. డబుల్ పవర్ విక్స్ ఏక్షన్-500 ఒక్క మాత్రలో, ప్రభావంగల, జలుబునుంచి ఉపశమనం యిచ్చే పదార్థాలన్నీ కలిసి వున్నాయి. మీకు పట్టిన జలుబునుంచి ఉపశమనం యిస్తూనే, మీరిక మునవటిలాగే చురుకుగా వుండగలుగుతారు. డబుల్ పవర్ విక్స్ ఏక్షన్-500 లోగల అద్వితీయమైన 4-రకాల చర్య. రొంపా, జలుబూ, దాని లక్షణాలన్నిటి నుంచీ సత్వరంగా, ప్రభావ పూరితమైన ఉపశమనాన్నిస్తుంది.

1. జలుబువల్ల వచ్చే తలనొప్పి, వంటినొప్పి నుంచీ ఉపశమనం.
2. ముక్కు దిబ్బడ వెయ్యడంనుంచి ఉపశమనం.
3. గొంతు గరగర లాడటం, గొంతు నొప్పినుంచి ఉపశమనం.
4. జలుబువల్ల వచ్చే జ్వరమూ మరియు ఫ్లూని అదుపులో పెడుతుంది.

**డబుల్ పవర్ విక్స్ ఏక్షన్-500 జలుబు నుంచి ఉపశమనం యిస్తూనే మిమ్మల్ని చురుకుగా ఉంచుతుంది.**




OBM/7004 TL

## నర్సింగ్ హోం

శివరామయ్య యాభై ఏళ్లవాడు 'సుమిత్రా' అంటూ అమిత కంగారు ప్రదర్శిస్తున్నాడు.

శేఖర్ వచ్చి అంతా పరీక్షించేడు. ఆమె నొప్పి అపెండిక్సు స్థలంలో వస్తూంది. అతని చేతివేళ్ళు ఆ స్థలాన్ని శల్యపరీక్షచేసేయి. అతను అతినెమ్మదిగా తన పరీక్ష పూర్తిచేసి సిస్టర్‌తో 'ఈమెను గదికి షిఫ్ట్‌చేయండి' అని శివరామయ్యతో 'మీరు కంగారు పడకండి, అయిదు నిముషాల్లో తగ్గిపోతుంది' అన్నాడు.

సిస్టర్ స్ట్రెచ్చర్‌ని గదిలోకి తీసుకుపోతోంది.

శివరామయ్య శేఖర్ చేతులు పట్టుకుని 'డాక్టరు గారూ! నా భార్యకు యీ నొప్పి అయిదేళ్లనించి వస్తూందండీ. నేను వేగలేకపోతున్నాను. ఈ వయస్సులో రెండో పెళ్లి చేసుకున్నందుకు దేవుడు నాకు చాలా బాగా బుద్ధి చెప్పేడండీ. ఈమె ప్రతీ మూడు నెలలకూ నెలన్నర నొప్పితో బాధపడుతూంటుందండీ' అన్నాడు.

శేఖర్ శివరామయ్యతో 'ఈమెకు అన్నదమ్ములు ఎవరేనా ఉన్నారా?' అంటూ అడిగేడు. 'ఎవరూ లేరండీ' అన్నాడు శివరామయ్య.

'ఎవరేనా దూరపు బంధువులో?' అన్నాడు.

'ఉన్నాడులేండి అత్తకొడుకు. వాడు యిక్కడే యిరవై మైళ్లదూరంలో ఎక్కడో పనిచేస్తున్నాడు.'

'సరేలేండి' అని రాజా వెంబడి తనూ గదిలోకి వెళ్లిసిస్టర్‌తో 'సిస్టర్ కొంచెం లిక్విడ్ అమోనియా తీసుకుని రా' అన్నాడు.

సిస్టర్ బయటికి వెళ్లింది.

లోనికి రాబోతూన్న శివరామయ్యతో 'మీరు బయటే ఉండండి. పదినిముషాల తర్వాత వొద్దురుగాని' అని సిస్టర్ లోనికి రాగానే తలుపు గొళ్లెం పెట్టించి, సుమిత్ర నోరు మూసి ముక్కు పుటాల దగ్గర అమోనియా ఉంచేడు. రెండు నిముషాలు కాళ్లు కొట్టుకుని తర్వాత బలంగా శేఖర్ చేతులు తన ముక్కు దగ్గరనించి తోసేందుకు ప్రయత్నించింది సుమిత్ర. ఆమెని తన చేయి తియ్యనీయకుండా బలంగా అదిమి వొక అరనిముషం తర్వాత తీసేసేడు. ముక్కునించీ, కళ్లనించీ నీరు కారుతూన్న సుమిత్ర -- నోరు మెదపకుండా స్పృహ లేనిదానిలా పడి ఉంది.

శేఖర్ బయటికి వచ్చి శివరామయ్యతో 'మీరు లోనికి వెళ్లండి' అన్నాడు.

రాజా శేఖర్‌తో నడుస్తూ 'ఏంకేసు డాక్టర్?' అన్నాడు.

'హిస్టీరియా' అన్నాడు శేఖర్.

'హిస్టీరియాకి అపెండిసైటిస్‌లాంటి నొప్పి వస్తుందా?'

'అసలు రాకూడదు. కాని ఈ కేసులో వస్తూంది.'

'ఎందుకేంటి?' అంటూ అడిగేడు రాజా.

'అదే మనం తెలుసుకోవాలి. నా అనుమానం నిజం అయితే ఈమె అత్తకొడుకును ప్రేమించింది. కాని ఈ ముసలివాణ్ణి పెళ్ళాడింది. అత్తకొడుకుకి దగ్గరగా, ఈ ముసలాడికి దూరంగా ఉండడమే ఈ హిస్టీరియా ఉద్దేశం అనుకుంటా. మనం రెండురోజులు చాలా జాగ్రత్తగా ఎవ్వర్నీ నమ్మకుండా నిఘావేసి ఉంచితే తెలుస్తుంది.'

తర్వాత ఎవరి వోపీకి వాళ్లు వెళ్లిపోయేరు.

(ఇంకా వుంది)



హైదరాబాద్‌లో ఆగస్టు 16వ క్రోక్విల్ క్లబ్ తృతీయ వార్షికోత్సవ సభలో క్లబ్‌ని ఆం.ప్ర. క్రోక్విల్ అకాడెమీగా పునర్వ్యవస్థీకరించిన సందర్భంలో ముఖ్య అతిథి, సాంస్కృతిక శాఖా మాత్యులు భాట్టం శ్రీరామమూర్తిగారి వద్ద నుంచి క్రోక్విల్ అవార్డు ప్రత్యేక బహుమతి నందుకుంటున్న కార్టూనిస్టు కుమారి రమాదేవి.



# ఇన్‌క్రిమిన్ బాలలు

## కేవలం పెద్దగాకాదు,ఎంతోచక్కగా పెరిగే పిల్లలు!




ఇన్‌క్రిమిన్ టానిక్ పెరిగే వయసులో ఎంతో పెద్ద...పెద్ద తేడాను తెస్తుంది. నిజానికి అసలు విషయం ఏమిటంటే ఇన్‌క్రిమిన్ టానిక్ ఇతర టానిక్‌లకన్న ఓ మెట్టు పైనుంది. ఎందుకంటే, ఆరోగ్యమైన పెరుగుదలకోసం అత్యవసరమైన విటమిన్లతోపాటు ఇన్‌క్రిమిన్‌లో లైసిన్ కూడా ఉంది గనక. ఆ లైసిన్ ఆకలిని పుట్టిస్తుంది. పిల్లలు చక్కగా పెరగాలంటే బాగా తినాలన్న మాట ప్రతి తల్లికీ తెలుసు. ఈ ఇన్‌క్రిమిన్ అలా బాగా తినే ఆహారాన్ని మేలైన పెరుగుదలకు తోడ్పడేలా మారుస్తుంది మరి.

Lederle ఉత్పాదన
*అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్.




## ఇన్‌క్రిమిన్*టానిక్

### తినేమంచి ఆహారాన్ని తీరైనపెరుగుదలగా మారుస్తుంది.

Sista's-INC-973/80 Tel F

# చవితి ఉండ్రాళ్ళు

- శేఖర్.. - వేణు



























మేమందరం గోల్డ్‌స్పాటర్స్

వారెవ్వా ! వహ్వా !
ఇదేమరి గోల్డ్‌స్పాటింగ్ రోజు !

ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ !
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాల చిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్సిన ముచ్చటైన
మురిపపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.




గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...మజా యే మజా!

# కైలాసంలో కలికాలం



అద్దేపల్లి సుచిత్రాదేవి

"వినయ్, వినూ! ఏం చేస్తున్నావ్? ఒక్కపని చేసిపెట్టరా" లోపలనుంచి పార్వతీదేవి పిలిచింది.

"ఏమిటో చెబుదూ! ఆర్టికల్ మాంచి యింటరెస్టింగ్‌గా వుంది" చదువుతున్న పుస్తకం వదలకుండా, అక్కడ్నుంచేమాత్రం కదలకుండానే అరిచాడు వినాయకరావ్.

చేతిలో పుస్తకం వుంటే ఇంక ఇటు రాడనుకుని పార్వతీదేవే కొడుకు గదిలోకి వచ్చింది.

"ఏంలేదురా వినూ! గేస్ అయిపోయింది. కాస్త కిరోసిన్ తెచ్చిపెడుదూ, రాత్రి వంటక్కూడా లేదు" బ్రతిమాలుతూ అన్నది.

"మైగాడ్, ఇప్పుడే నేను మార్కెట్ నుంచి పడుతూ లేస్తూ నానా అవస్థలూపడి ఆ సిటీబస్సులో యజ్ఞం చేసి వచ్చాను. మళ్ళీ ఆ కిరోసిన్ క్యూలో నిలబడటమంటే నా వల్ల కాదు" తల అడ్డంగా తిప్పాడు వినాయకరావ్.

"అలా అంటే ఎలారా? అయినా నీ వాహనం ఏమయింది, సిటీబస్‌లో వచ్చానంటున్నావు?"

"అదా, దాన్ని బృహస్పతి మాష్టారు ఏదో ప్రయోగం చెయ్యాలంటే యిచ్చాను. ముందస్తుగా ఎలుకమీద తన ఫార్ములా ప్రభావం చూస్తానన్నారు" పుస్తకం పేజీలు తిప్పుతూ తేలిగ్గా చెప్పాడు.

"అయ్యో, ఆ మతిమరుపు ప్రొఫెసర్‌గారికే యిచ్చావూ! ఒకటి కలపబోయి మరొకటి కలిపి దాన్ని కాస్తా ఆ పిచ్చిదానిపై ప్రయోగించేస్తాడురా" పార్వతీదేవి మూషికాన్ని తలుచుకుని ఆదుర్దాపడింది.

అప్పుడే అటువచ్చిన కుమారస్వామి అందుకున్నాడు –

"అవును మమ్మీ! అసలా మూషికాన్ని వదిలించుకుందుకు కావాలనే బృహస్పతిగారదక్కముందే అన్నయ్యే యిచ్చివుంటాడు. 'మంచి స్కూటర్ కొనమని డాడీతో చెబుదామంటే ఈ పాడు ఎలకొకటి నా ప్రాణానికి' అని చాలాసార్లు విసుక్కోవటము నేను విన్నాను."

వినాయకరావుకి కోపం వచ్చింది. "అవును అంటాను. నా వాహనం నా యిష్టం. అయినా మయూరం మీదెక్కి విహరించటమనుకున్నావా, ఎలుకమీద వూరేగటం? నీకేం తెలుసు. అసలు నా గొడవలన్నీ నీ కెందుకు?" తమ్ముడిమీద ఎగిరి, చేతిలో పుస్తకంతో విసురుగా ఆ గదిలోంచి వెళ్ళిపోయాడు వినాయకరావ్.

"సర్లే, యిప్పుడా గొడవెందుగ్గాని, ఒరేయ్ సుబ్రమణ్యాం కాస్త నువ్వయినా వెళ్ళి కిరోసిన్ తెచ్చిపెడుదూ." మళ్ళీ చిన్నకొడుకును బ్రతిమాలుకో సాగింది పార్వతీదేవి.

"అబ్బా, సుబ్రమణ్యాం ఏమిటి? పాత చింతకాయ పచ్చడి పేరూ! చక్కగా 'కుమార్ అని పిలువు' అని ఎన్నిసార్లు చెప్పాలి నీకు. ఈసారలా పిలిస్తే నేను పలకనంతే" కుమారస్వామి తల్లికి వార్నింగిచ్చాడు.

పార్వతీదేవి శాంతంగా "అలాగేలేరా, ఎలాగోలా పిలుస్తాను. ముందా కిరోసిన్ సంగతి చూడు."

అంతవరకూ తల్లి మాటలు ఏదో పరధ్యానంగా వింటున్న కుమారస్వామి 'కిరోసిన్' అనగానే వులిక్కిపడి, "ఏమిటీ కిరోసినా! బాప్‌రే ఆదేవన్నా వరాలు పొందిన రాక్షసుడ్ని హతమార్చటమను కున్నావా? ఎంత క్యూ, ఎంత యుద్ధం! అయ్యబాబోయ్! నావల్లకాదు. ఈ పూట ఏ బ్రెడ్డో, పండ్లో పెట్టెయ్. రేపొద్దున నందీశ్వర్ వస్తాడుగా. అతగాడిని పంపించావంటే ఎలాగోలా కుమ్ముకుంటూ వెళ్ళి నీకు కిరోసిన్ పట్టుకొస్తాడు." అంటూ ఓ వుచిత సలహా యిచ్చి చల్లగా అక్కడ్నుంచి జారుకున్నాడు.

"ప్చ్, అంతా ఖర్మ. ఏం చెయ్యాలి. ఇద్దరు కొడుకులున్నారు. ఒక్కడూ ఒక్క పనీ చేసుకురారు. అదేమంటే కబుర్లు చెబుతారు. ఎంతమంది పనివాళ్ళున్నా అంతా ఆఫీసు వర్కు చేసేవాళ్ళే, యిక యింటి పనెవరు చేస్తారు. ఈయనకేమో యింటి ధ్యాస పట్టదు. ఎంతసేపూ తాళాలు, తాండవాలు అంటూ ఆ మ్యూజిక్ కాలేజీ వదిలిరారు. ఒక్కదాన్ని ఎన్నింటినని చూసుకునేది?" పార్వతీదేవి విసుక్కుంటూ వంటింటివైపు నడిచింది.

* * *

కాలింగ్ బెల్ మోత విని అల్లుతున్న వూలు బేగ్‌ను పక్కన పెట్టి యివతలకొచ్చింది పార్వతీదేవి.

దిక్పాలకుల భార్యలు, మిగతా దేవలోకంలోని స్త్రీలు చాలామంది వున్నారు బయట.






"ఏమిటే, అంతా ఒక్కసారే వచ్చారు" నవ్వుతూ పలకరించింది.

"మన మహిళామండలి అంతా కలిసి స్త్రీలకు జరుగుతున్న అన్యాయాల గురించి నిరసనగా వూరేగింపు జరపాలనుకుంటున్నాము కదా! కోరుకోబోతున్న భద్రతలు, హక్కులపై మనలోనే చాలా మంది పలురకాల అభిప్రాయాలు చెబుతున్నారు. ఒకరు చెప్పేది మరొకరికి నచ్చటంలేదు. ఏం చెయ్యాలా అని..." గాలిరావు భార్య విశదపర్చింది.

పార్వతీదేవి అదే చిరునవ్వుతో అందర్నీ కూచోమని సైగ చేసింది. ఆశీనులయిన అందర్నీ కలియజూస్తూ వుపన్యాస ధోరణిలో గొంతు సవరించుకుంది —

"చూడండీ, మనలో మనకే యిన్ని విభేదాలుంటే యిక సాధించేదేం వుండదు. ఒకరి అభిప్రాయం మరొకరు కాదనటం కేవలం వ్యక్తిగత కక్షల కారణమేనని నాకు తెలుసు. ఒకరు సూచించిన న్యాయమైన హక్కుని మరొకరు అలాక్కాదంటే యిక అడిగేదేమిటి? మనం సమాజ శ్రేయస్సు చూడాలి. సాటి వనితకు జరుగుతున్న అన్యాయం దృష్టిలో పెట్టుకోవాలి. నిన్న ఒక సామాన్యురాలికి జరిగిన అవమానమే రేపు మనకు జరగవచ్చు. చేతులు కాలాక ఆకులు పట్టుకోకూడదు. ముందు జాగ్రత్తతో ఆలోచించండి. ఒక్క రోజైనా మీ అపోహలు, ద్వేషాలు మరిచిపోండి. అందరం ఒక్క త్రాటిమీదే నడవాలని, మంచిదైన ఒక ఏకాభిప్రాయానికి రండి. ఇంతకన్నా నేను చెప్పేదేముంది!" మృదువుగానే అన్నది.

స్త్రీ లోకమంతా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"ఎన్ని మాటలయినా నవ్వుతూనే ముఖాన అనెయ్యగలదీవిడ" అనుకున్నారు కొందరు.

ఆ తర్వాత పార్వతీదేవి యిచ్చిన మంచుముక్కల నీళ్ళు తాగి "రేపే నిరసన ప్రదర్శన! ముందు మీరే వుండాల"ని మరీ మరీ చెప్పి బయటపడ్డారు.

వాళ్ళలా వెళ్ళగానే పరమశివుడు లోపలికి వచ్చాడు. ఆయన్ని చూస్తూనే పార్వతీదేవి కప్పుతో కాఫీ తీసుకువచ్చింది.

చర్మపు యీజీ ఛైర్లో వాలి ఓ నిముషం రిలాక్స్ అయి, చిన్నగా కాఫీ సిప్ చేసాడు. వెంటనే ముఖం గంటు పెట్టుకుని భార్యవైపు చూసాడు — "ఏమిటే కాఫీలో అసలు చక్కెరే వెయ్యలేదా?"

"చక్కెరా! ఆ మాటే ఎత్తకండి. ఇంకొన్ని రోజులకు అదెలా వుంటుందో కూడా మరిచిపోవాల్సి వుంటుంది. అయినా మీకేం, విషమే మింగినవాళ్ళు చక్కెరలేని కాఫీ తాగలేరూ! ఎటొచ్చీ ఇబ్బందంతా మాకే" దిగులుగా అన్నది.

"మరీ అంత డిమాండుగా వుందా?" చేదు కాఫీ గుటకలు వేస్తూ అడిగాడు పరమశివుడు.

పార్వతీదేవికి ముంచుక కోపం వచ్చింది. "అసలు మీకే విషయాలు పడతాయి చెప్పండి? వూరంతా పలుకుబడే! కానీ కిలో చక్కెరకు దిక్కుండదు. సరే అదలా వుండనివ్వండి. ఇంతకీ కుమార్ విషయమేమన్నా ఆలోచించారా?"

చప్పున కప్పు కింద పెట్టేసి, ప్రొద్దున హడావుడిలో అసంపూర్తిగా చదివిన పేపరందుకుని ముఖానికి అడ్డుపెట్టుకున్నాడు శివుడు.

"ఉద్యోగాలకి ఎంత తన్నుకు లాడుతున్నారో ఏమయినా చూస్తున్నారా? అందునా నీ కొడుక్కి చిన్న చిన్న పోస్ట్లు పనికిరావాయే - అధికార హోదాలు తప్ప" మెల్లగా అన్నాడు.

"మహ వేయించారులెద్దూ! పెద్దబ్బాయిని మీ డిపార్టుమెంటులోనే గణపతిని చేసారు. అదీ గొప్పేనా? అసలందులో ఓ ఎదుగూ బొదుగూలేదు అవార్డులు అంతకన్నా లేదు."

ఆ అభియోగానికి మౌనం వహించేడు పరమశివుడు. కొద్దిసేపుండి "సుబ్రమణ్యాన్ని ఓసారి మహేంద్రరావుని కలుసుకోమని చెప్పరాదూ?" సాలోచనగా అన్నాడు.

"ఇంత బ్రతుకు బ్రతికి, మన బ్బాయే స్వయంగా ..." ఆపై మాట్లాడలేక ఆయాసం వచ్చింది పార్వతీదేవికి.

ఆమెవైపోసారి చూసి మౌనంగా పేపర్లో తలదూర్చాడు. ఓ పేరా చదివి నవ్వుతూ తలెత్తాడు. "అమెరికావాళ్ళు మళ్ళీ కొలంబియాని ప్రయోగిస్తున్నారట!"

"నేనూ పేపర్ చూసాను" కరుగ్గా అన్నది. 'ఇంటి విషయాలు మాట్లాడుతుంటే మధ్యలో యివెందుకూ' అని కోపం వచ్చింది ఆమెకు.

భార్య కోపం గ్రహించినవాడై, శాంతపరచటం భర్త కర్తవ్యమనిపించింది శివుడికి. "ఏం చెయ్యాలా?" అని ఆలోచిస్తే ఆడవాళ్ళని ప్రసన్నులుగా చేసుకోవాలంటే ముందస్తుగా వాళ్ళ దగ్గర కొంచెం గారాలు పోవాలని ఎక్కడో, ఎప్పుడో చదివినది గుర్తొచ్చింది. వెంటనే కవాలని పేపర్ విసుగ్గా పక్కన పడేసి, భార్యవైపు తిరిగి కొంచెం ప్రేమగా "అబ్బ, చాలా తలనొప్పిగా వుంది" అన్నాడు.

పార్వతీదేవి భర్తవైపు దీర్ఘంగా చూసింది.

"కొంచెం జలుబు కూడా చేసినట్లుంది" ముఖం బాధగా పెట్టాడు.

'ఇక ఆమె తనను లాలించడమే తరువాయి' అనుకుంటున్నంతలో అనుకోని తీవ్ర ఫలితం ఎదురయింది.

ఆ మాటతో ఏదో గుర్తుకువచ్చిన పార్వతీదేవి అపరకాళియై గయ్యిమని లేచింది — "జలుబు చెయ్యదూ మరి! నెత్తిన ఆవిడగారిని పెట్టుకు వూరేగుతుంటే! అసలు మీతో నేను కాబట్టి కాపురం చేస్తున్నాను. ఇంకోరింకోరయితేనా?" విసురుగా లోపలికి వెళ్ళిపోయింది.

పరమశివుడు తెల్లబోయాడు. తర్వాత "అరెరెరెరె" అనుకున్నాడు. కానీ యిక చేసేదేముంది? భార్య వెళ్ళిన దిక్కే చూస్తూ "సారూ" బాధగా గొణిగాడు దేవదాసులా. 

## "ఏకదంత మహాస్మహే"



—ఫొటో : సుధాకర్ యడవల్లి

## ఒక్క విమల్ మాత్రమే—ఈ సంవత్సరం 70 లక్షల మీటర్లకు పైగా సూటింగ్స్‌ను మీకు సగర్వంగా సమర్పిస్తుంది.

**రూ. 100 కోట్లకు పైగా పెట్టుబడి:**
మీరు ధరించబోయే విమల్ సూట్ సర్వోత్తమంగా ఉండటానికని, విమల్ వారు రూ. 100 కోట్లకు పైగా పెట్టుబడి చేసి భారతదేశంలోని అత్యంత ఆధునికమైన టెక్స్‌టైల్ ప్లాంట్‌ని నెలకొల్పారు. ఈ ప్లాంట్ ఉత్కృష్ట ఉత్పాదనే విమల్ సూటింగ్.

**పెద్దలకు పిన్నలకు:**
అందరికి నప్పే రంగులు, డిజైన్లు—16 వేలకు పైగా.



# కలలో వినాయకుడు



ఈమధ్య కలలో వినాయకుడు కనిపించాడు. కనిపించినవాడు ఊరికే వూరుకోలేదు. నాతో ఇంటర్వ్యూ మొదలుపెట్టాడు. ఆయనకూ నాకూ జరిగిన సంభాషణ గుర్తున్నంతవరకూ ఇక్కడ ఇస్తున్నాను.

"ఏమయ్యా, రావి కొండలరావూ..."

"క్షమించండి స్వామీ... ఆరంభంలోనే ప్రూఫ్ తప్పులు... తమరు విద్యావేత్తలు, మహా పండితులు... తమరే ఇలా..."

"అవునయ్యా — తప్పు పలికాను. ఏం చెయ్యమంటావు ? భూలోకం వచ్చినా, అందులోనూ నీ కల్లోకి వచ్చానా — అంతే. మీ ప్రభావం. సర్లే — నువ్వేమిటి, సినిమాల్లో వేషాలు వేస్తావా ?"

"అవునండి. వెధవ వేషాలు తప్ప, తక్కినవి వేస్తూ వుంటానండి."

"హాస్యం చేస్తావుట."

"హాస్యం అన్నది చెయ్యకూడదండి — అది అలాగే రావాలండి. కాని, సినిమాల్లో చెయ్యవలసి వస్తున్నదండీ."

"మీ జనం నవ్వుతారా ?"

"వీళ్లైనపుడు నవ్వుతారండీ — లేకపోతే పక్కవాళ్లు కితకితలు పెడతారండీ."

"నా వేషం వేశావా ఎప్పుడైనా నువ్వు ?"

"లేదండి — మీలా నాకు అంత పొట్ట లేదండీ."

"లేకపోతే ఏమయ్యా, తగిలిస్తారుగా. తొండాలు కూడా తగిలిస్తారు. అవునూ, మీ సినిమాల్లో తొండం ఆడదేమయ్యా ?"

"అది అట్టతో చేస్తారండి. అందుకని కదల్దు."

"అంతా అట్టే. మా నాన్న వేషాలు వేసే వాళ్ల మెడల్లో పాములూ అట్టే. అవీ కదలవు."

"మీ తండ్రిగారిలాగా నిజం పాములు వేసుకుంటే, వెంటనే మీ కైలాసం వచ్చేయాలండీ. ఇంతకీ తమకేం కావాలి లంబోదరంగారూ ?"

"నిన్ను కొన్ని ప్రశ్నలు అడుగుతాను. సమాధానం చెప్పు."

"చిత్తం."

"నువ్వు ఎన్ని సినిమాల్లో వేశావు ?"

"వేశానండి దగ్గర దగ్గర రెండొందలు."

"ఏం సాధించావు ?"

"ఏమీ లేదండి "

"మరెందుకు వేస్తున్నావు ?"

"పొట్టకూటికండి."

"నీకున్న చిన్న పొట్టకి ఇన్ని వేషాలు వెయ్యాలా ? అయితే కళ కోసం కాదన్నమాట నువ్వు నటించడం."

"కాదండి. పొట్టకోసమేనండి."

"మరి వేదికమీద ఉపన్యాసాల్లో 'కళ' అంటావే."

"అవి ఉపన్యాసాలు గదండీ. చప్పట్లు కొట్టించుకోడానికి అలాగే మాట్లాడాలండి."

"అన్నీ అబద్ధాలన్నమాట."

"ఏం చేస్తామండీ, తప్పదు మరి !"

"నీకు నచ్చిన పాత్ర ఏది ?"

"నేను రోజూ అన్నం తినే స్టీలు పాత్రండీ."

"నీ హాబీ ఏమిటి ? —"

"నిద్రపోవడం అండీ."

"నిజం చెప్పు ?"

"నిజంగా అంతేనండి. అబద్ధం చెప్పమంటే మాత్రం — స్విమ్మింగ్, పెయింటింగ్, క్రికెట్, గిటారు నేర్చుకోడం, ఇంగ్లీషు సినిమాలు చూడ్డం."

"ఇంగ్లీషు సినిమాలు చూడవా—ఎంచేత?"

"అర్థం కావండీ. కాని, చూసినట్టు చెప్పేస్తానండి. లేకపోతే నామోషీ."

"నీకు రోజూ అభిమానుల దగ్గర్నుంచి ఉత్తరాలు వస్తూ వుంటాయా ?"

"రావండి. ఆర్నెల్లకొకటొస్తే గొప్ప."

"సినిమాలకి రాకముందు నువ్వేంచేసేవాడివి ?"

"రావడానికి ప్రయత్నాలు చేసేవాడినండి."

"మరి, నువ్వెక్కడో వుంటే, ఒక నిర్మాత వెతుక్కుంటూ వచ్చి నిన్ను బుక్ చేశాడని ఎక్కడో చదివాను."

"అబద్ధం అండీ, అలా రాయకపోతే పరువు తక్కువేమోనని - రాశానండి."

"నీకు నచ్చిన నటులెవరు ?"

"చెప్పనండి... చెబితే తక్కినవాళ్లకి కోపాలొస్తాయి. కావాలంటే హాలీవుడ్ నటుడి పేరు చెబుతానండి."

"చెప్పు"

"వియ్‌వన్సీ లిమ్రకావర్గ్."

"ఇదేమిటయ్యా — నేనెక్కడా వినలేదు."

"అవార్డు విన్నరండీ. ఎక్కువ సినిమాల్లో వెయ్యలేదు."

"అవార్డు సినిమాలమీద నీ అభిప్రాయం ఏమిటి ?"

"ఏంలేదండి."

"ఏం ?"

"నేను చూడలేదు గనక."

"అదేమిటి, సినిమాల్లో వుంటున్నావు — చూడవా ?"

"చూసినా అర్థంకావండి."

"నీకు సినిమా తీసే ఉద్దేశం వుందా ?"

"లేదండి."

"ఎంచేత ?"

"తీసుకొచ్చి ముంచడానికి నాకు డబ్బున్న స్నేహితులు, బంధువులూ లేరండి."

"నీ అభిమాన దర్శకులెవరు ?.. పోనీ, ఇతర భాషలవాళ్ల పేర్లు చెప్పు."

"సత్యజిత్ రాయ్, విలియమ్ వైలర్, పోలాన్‌స్కీ మొదలైనవారు."

"ఏంచేత వీళ్లంటే నీకు అభిమానం ?"

"వాళ్ల సినిమాలేవీ చూడలేదు గనక."

"ఓరి — అన్నీ అబద్ధాలే."

"మీ ముందు నిజం చెబుతున్నాగదండీ."

"పోవయ్యా - ఒక్కటీ సందర్భ శుద్ధిగా లేదు. అనవసరంగా నా టైమంతా పాడు చేశావు."

"నాలుగు ఉండ్రాళ్లు తిని వెళ్లండి."

"ఇంకా నయం. గుండ్రాళ్లు తినమన్నావు కాదు. రేపెక్కడ నీకు షూటింగ్ ?"

"నిజానికి లేదండి. కాని, అవుట్‌డోరండి."

"ఎక్కడ ?"

"తెలీదండి."

"ఇప్పుడెన్ని సినిమాలున్నాయి ?"

"తెలుగులో పన్నెండు, కన్నడం, తమిళంలో ఇరవై ఆరు."

"చాలా బిజీగా వున్నావన్నమాట."

"అవునండి — 1983 వరకూ డైరీ ఖాళీ లేదండి. మీరు మళ్లీ 84లో కనిపించండి."

"ఓర్నీ అబద్ధాలు కూలా."

"అమ్మోమ్."

"ఏం ?"

"ఈ కన్నంలోంచి ఏదో పరుగెత్తిందండీ."

"అది నా వాహనం — ఎలుకయ్యా బాబూ ..."

ఎలుకంటే నాకు భయం. ఆ భయంతో గట్టిగ ఓ కేక పెట్టి కళ్లు తెరిచాను. కల కరిగిపోయింది.

—రావి కొండలరావు

SARIGAMA PRODUCTIONS

సరిగమ ప్రొడక్షన్స

# ఘరానా గంగులు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
**కట్టా సుబ్బారావు**

నిర్మాత
**ఎ.పోతరాజు**

ఈస్ట్‌మన్ కలర్



THARAKAPRABHUADS

నైజాం: నారంగ్ ఎంటర్‌ప్రైజెస్ సీడెడ్: వీనస్ మూవీస్

## నాకు నచ్చిన జోకు

### పద్మనాభం

ఇద్దరు మిత్రులకు గుర్రప్పందాలంటే చాలా పిచ్చి. వాళ్ళిద్దరూ ఒకరోజు ఏదో సినిమాకు వెళ్తే, అందులో కూడా గుర్రప్పందాల సీన్ వచ్చింది. ఫలానా గుర్రం ముందు వస్తుందంటే ఫలానా గుర్రం ముందు వస్తుందని వాళ్ళిద్దరూ అక్కడ పందెం వేసుకున్నారు. మొదటివాడు చెప్పిన గుర్రమే గెలిచింది.

రెండోవాడు ఏడ్పుముఖంతో పది రూపాయల పందెం డబ్బు చెల్లిస్తూ, "ఆ గుర్రమే గెలుస్తుందని నీకెలా తెలుసోయ్?" అన్నాడు.

"ఈ పిక్చర్‌ను నిన్న చూశానులే," అని జవాబిచ్చాడు మొదటివాడు.

### రాజ్‌బాబు

"మీ కారును ఎవరో దొంగిలించుకు పోయారటగా ?"

"పోతే పోయింది. భగవంతుడికి నేను థాంక్స్ చెప్పుకోవాలి."

"ఎందుకు ?"

"ఆ సమయంలో నేను కారులో ఉంటే, నేను కూడా గల్లంతు అయి ఉండేవాడ్నిగా?"

### రమాప్రభ

ఇద్దరు యువకులు ఇలా మాట్లాడుకో సాగారు :

"నిన్న రాత్రి హేమమాలిని నా కలలో వచ్చింది."

"అబద్ధం. నిన్న నా కలలో వచ్చింది. అదే సమయంలో నీ కలలోకి ఎలా రాగలదు?"

"ఐతే, నీ కలలోకి వచ్చింది ఆమె డూప్ అయి ఉండాలి."

## సినిమా

—జి.వి.జి

### దేవుని రూపాలు

"కల్లాకపటం తెలియని పిల్లలే దేవుని రూపాలు – అనే కథాంశంతో రూపొందిస్తున్నాం," అన్నారు జి. రామమోహనరావు. ఈయన దర్శకత్వం వహించే భానోదయా ఫలిమ్స్‌వారి చిత్రం తొలి షెడ్యూల్ ఆగస్ట్ 10 నుంచి 25 వరకు శ్రీశైలంలో జరిగింది. శరత్‌బాబు, సత్యనారాయణ, ఈశ్వరరావు, రమణమూర్తి, గీత, నిర్మల, బేబీరాణి, పబ్లిసిటీ ఆర్టిస్ట్ గంగాధర్ కుమారుడు మాస్టర్ కాంతి పాల్గొంటున్నారు. యడవల్లి మాటలు, సత్యం సంగీతం, విన్సెంట్ ఛాయ, మణి కూర్పుతో ఎం. ఎ. రెడ్డి నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. "ఆగస్ట్ 27 నుంచి సెప్టెంబర్ 12 వరకు హైదరాబాద్‌లో రెండవ షెడ్యూల్ జరుగుతుంది," అన్నారు ఈ చిత్ర కథకుడు, నిర్మాత వై. మాధవయ్య.

'అంతం కాదిది ఆరంభం'లో విజయనిర్మల, కృష్ణ



# టాప్ స్టార్ ఉన్న కప్పు ఏది ?



## చూడండి, ఇక్కడ చిక్కని, కమ్మని టీ ఉన్నది

**చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం
రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం**

చిక్కదనపు పరీక్ష...చేసి చూడండి...టాప్‌స్టార్ అన్నిటికన్నా మెరుగు...మరే ఇతర టీకన్నా చిక్కనిది — చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్.

ఎందుకంటే, ప్రత్యేకమైన భారతీయ తేయాకుల తాలూకు ఘాటైన (స్ట్రాంగ్) సమ్మేళనం నుంచి తయారైంది లిప్టన్ టాప్‌స్టార్... సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ కోరుకునే వారి కోసం!




# లిప్టన్ టాప్ స్టార్ టీ

**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**




LINTAS-LTS, 6-2315 TL.

## సినిమా

### రూబీ మూవీస్

"సెప్టెంబర్ 15 నుంచి అక్టోబర్ 15 వరకు రాజమండ్రి సమీపాన ఉన్న గుమ్మళ్ళదొడ్డి, గూటాల, పోలవరం, ఈతకోట ప్రాంతాల్లో షూటింగ్ నిర్ణయించాం," అన్నారు రూబీ మూవీస్ వారి చిత్రానికి కథ సమకూర్చి తొలిసారిగా దర్శకత్వం నెఱపే వేజెళ్ళ సత్యనారాయణ ఈయన గతంలో "ఊరుమ్మడి బతుకులు" చిత్రానికి నిర్వాహకుడుగా, "చలిచీమలు, ఛాయ" చిత్రాలకు కథ, స్క్రీన్‌ప్లే రచయితగా పనిచేశారు నూతన్‌ప్రసాద్, నరసింహ రాజు, గుమ్మడి, సాయిచంద్, రమణమూర్తి, సాక్షి రంగారావు, పి ఎల్ నారాయణ, ఉపేంద్ర, కిరణ్‌బాబు, జ్యోతి, గీత, టి రాజేశ్వరి, కొత్త నటుడు శివాజీ పాత్రధారులు. బాబీ, పరుచూరి,



'ఘరానా గంగులు'లో శోభన్‌బాబు

వేజెళ్ళ తయారుచేసిన స్క్రీన్‌ప్లేకు పరుచూరి గోపాలకృష్ణ సంభాషణలకర్త కొసరాజు శివరాం, వెల్లుట్ల, శ్రీమతి జ్యోతిర్మయి, పరుచూరి గీతాలకు జి కె వెంకటేశ్ సంగీతమిచ్చారు ఉదయరాజ్ ఛాయ, రామలింగేశ్వరరావు శిల్పం, బాబూరావు కూర్పుతో ఎస్ కృష్ణంరాజు నిర్మాత

### కిరాయి రౌడీలు

"న్యాయం కావాలి" స్టార్స్ చిరంజీవి, రాధిక, డైరెక్టర్ కోదండరామిరెడ్డి, రచయిత సత్యానంద్, సంగీత దర్శకుడు చక్రవర్తి, ఛాయాగ్రాహకుడు వెంకట్‌తో నిర్మాత క్రాంతికుమార్ పై చిత్రాన్ని శ్రీ క్రాంతి చిత్ర పతాకంలో ఆగస్టు 22న ప్రారంభించారు మోహన్‌బాబు, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు భాస్కరరాజు శిల్ప దర్శకుడు కృష్ణ సంకలనకర్త

# నిధానంగా ఐదు నిమిషాలు ఆలోచించండి

నా కుమారుడు యేమవుతాడు? నా కుమార్తె భవిష్యత్తు యేమవుతుంది? వారి భవిష్యత్తునకు సంబంధించిన ప్రతి పథకం డబ్బుతో కూడినపని. పెద్ద పెద్ద మొత్తాల్లో డబ్బు కావాల్సి వుంటుంది!
మా మూడు లాభాల - యేక పథకంక్రింద 5 యేండ్ల కాలం మాత్రమే డబ్బు పొదుపు చేశారంటే, మీరు మీ బిడ్డల ఉన్నత విద్యలకు తగిన యేర్పాటు చేయగలరు మరియు వారు తమ జీవితాన్ని చక్కగా ప్రారం-భించుటకు కూడా సహాయపడగలరు.

**మూడు-అంచెల పథకం**
1 వ చర్య
**క్యుములేటివ్ డిపాజిట్**

మీ బిడ్డ మొదటి పుట్టినదినమున వాని పేరుమీద ప్రతినెలా రు. 100/- పొదుపు చేయునట్లు 60 నెలల కాలం సిండికేట్ బ్యాంక్‌నందు క్యుములేటివ్ డిపాజిట్ ప్రారంభించండి. మీ బిడ్డకు ఆరు యేండ్లు వయస్సు వచ్చునప్పటికి యీ క్యుములేటివ్ డిపాజిట్ రు. 7791/-కి పెరిగి వుంటుంది.



| క్యుములేటివ్ డిపాజిట్ | | |
|---|---|---|
| నెలకు రు. 100/- వంతున చెల్లించినపుడు | | |
| నిర్ణీత కాలం | చెల్లించిన మొత్తం | ఫలితపు విలువ |
| 12 నెలలు | రు. 1200 | రు. 1250-00 |
| 36 నెలలు | రు. 3600 | రు. 4208-00 |
| 48 నెలలు | రు. 4800 | రు. 5911-00 |
| 60 నెలలు | రు. 6000 | రు. 7791-00 |

2 వ చర్య
**ప్రగతి రొఖ్ఖపు సర్టిఫికేట్**

పై సొమ్మునుండి రు. 7440/- లను సిండికేట్ బ్యాంక్ ప్రగతి రొఖ్ఖపు సర్టిఫికేట్ క్రింద 120 నెలల్ల కాలమునకు మీ బిడ్డ పేరుమీద తిరిగి పెట్టుబడి పెట్టండి. మీ కుమారునికి/కుమార్తెకు 16 యేండ్ల వయస్సు వచ్చునప్పటికి యీ సర్టిఫికేట్ విలువ రు. 20,000 కాగలదు.



| ప్రగతి రొఖ్ఖపు సర్టిఫికేట్ | | |
|---|---|---|
| డిపాజిట్ మొత్తం | కాలం | ప్రగతి రొఖ్ఖపు సర్టిఫికేట్ విలువ |
| రు. 372-00 | 120 నెలలు | రు. 1,000 |
| రు. 7440-00 | 120 నెలలు | రు. 20,000 |
| రు. 610-00 | 60 నెలలు | రు. 1,000 |
| రు. 6100-00 | 60 నెలలు | రు. 10,000 |

3 వ చర్య
**సోషల్ సెక్యూరిటీ డిపాజిట్**

ఈ రు. 20,000 సొమ్మును మీరు మరొకమారు సోషల్ సెక్యూరిటీ డిపాజిట్ క్రింద సిండికేట్ బ్యాంక్‌నందు 60 నెలల కాలం పెట్టుబడి పెట్టవచ్చు. ప్రతినెల వడ్డీ రాబడి క్రింద, మీ బిడ్డలకు రు. 165/- వారి స్వంత ఖర్చులకు వాడుకొనుటకై వస్తూంటుంది. వారికి 21 యేండ్ల వయస్సు రాగానే తమ జీవితాన్ని వారు చక్కగా ప్రారంభించుటకు వీలుగా రు. 20,000 సొమ్ము కూడా సిద్ధంగా వుంటుంది.



| సోషల్ సెక్యూరిటీ డిపాజిట్ | | |
|---|---|---|
| డిపాజిట్ మొత్తం | కాలం | ప్రతినెల రాబడి |
| రు. 5,000 | 60 నెలలు | రు. 41.32 |
| రు. 10,000 | 60 నెలలు | రు. 82.64 |
| రు. 20,000 | 60 నెలలు | రు. 165.28 |

మీరు యే నెలకు ఆ నెల పొదుపు చేసే వారైతే మీకు యీ మూడు అంచెల పథకం లాభకరమైంది. మీరు పెద్ద మొత్తాలలో పొదుపు చేసేవారైతే మీరు 2 వ పద్ధతిగాని 3 వ పద్ధతిగాని యెన్ను కొని విదేశాలకు వెళ్ళాలని, స్వంత బండి వుండాలని, స్వంత యిల్లు వుండాలని మీకు చిరకాలంగా వున్న కోర్కెలను తీర్చుకోవచ్చు.
**ఇది నిజంగా తెలివైన పద్ధతిగదూ?**

5 యేండ్ల కాలం చేయు పొదుపు మీ బిడ్డల భవిష్యత్తుకు అనుకూలంగా యెంతో సహాయం చేస్తుంది.



**సిండికేట్ బ్యాంక్**
ప్రజల క్షేమాన్ని కోరు బ్యాంక్

maa SB 180

# సి ని మా

## డాక్టర్ బాబూరావు నిర్మించే చిత్రాలు

"ఇంతవరకు మూడు షెడ్యూల్స్‌లో పది రీళ్ళ చిత్రం పూర్తయింది. సెప్టెంబర్, అక్టోబర్‌లో జరిగే మిగతా రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ప్రముఖ కేన్సర్ స్పెషలిస్ట్ బాబూరావు. ఈయన ఊర్మిళా ఫిలిమ్స్ పతాకంలో నిర్మించే "మానవులారా మన్నించండి" చిత్రంలో మాతన్‌ప్రసాద్, ప్రసాద్‌బాబు, శ్యామ్‌సుందర్, త్యాగరాజు, వంకాయల సత్యనారాయణ, రావు గోపాలరావు, జ్యోతిలక్ష్మి, జయమాలిని, టి. రాజేశ్వరి, విజయలక్ష్మి, లక్ష్మిశ్రీ, ఇందిర, సత్యచిత్ర నటవర్గం. సాహితి కథకు దాసం గోపాలకృష్ణ మాటలు రాశారు. బి. శంకర్



'మాయదారి అల్లుడు'లో జయప్రద

స్వరకల్పనలో పి. నారాయణరెడ్డి, సాహితి గీతాలు రాశారు. ఎన్. ఆర్. కె. మూర్తి ఛాయ, రంగారావు శిల్పంతో పి. భాస్కర్ దర్శకుడు.

ఊర్మిళా పిక్చర్స్ బానర్‌లో తయారయ్యే "మహా పతివ్రత" చిత్రానికి ఆగస్ట్ మాసాంతంలోగా పాటలు రికార్డ్ చేయబడతాయి. సెప్టెంబర్‌లో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తవుతుంది బి. శంకర్ సంగీతం, ఎన్. ఆర్. కె. మూర్తి ఛాయ, భారతీకల్యాణ్ సహకార దర్శకత్వంతో గోన విజయరత్నం కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వం నిర్వహిస్తారు

### మహాప్రస్థానం

"విప్లవ శంఖం" అనంతరం మాదాల రంగారావు ప్రధాన పాత్ర ధరిస్తూ, నిర్మాణ సారధ్యం వహించే పై చిత్రానికి సెప్టెంబర్‌లో గీతాలు రికార్డ్ చేయబడతాయి. తోటకూర ఆశాలత కథకు శ్రీశ్రీ మాటలు, పాటలు రాస్తున్నారు కె. హేమాంబరధరరావు దర్శక నిర్మాత.

# సినిమా జోకాయణం!

''మొన్న ఒకేరోజు నాలుగు పిక్చర్లు రిలీజ్ అయ్యాయి కదా ? మీరు నిర్మించిన చిత్రాన్నే ముందు చూశాను.''

''థాంక్యూ ! ఇంతకీ, ముందు నా చిత్రాన్నే చూడ్డానికి కారణమేమిటో !''

''ఏముందీ ... మిగతా మూడు చిత్రాలకూ టిక్కెట్లు దొరక్క.''

* * *

ఒక పెట్రోల్ బంక్‌లో ''అగ్గిరవ్వ'' పోస్టర్ అంటించబోతే, ఆ బంక్ యజమాని ''బాబూ ! ఎందుకైనా మంచిది. ఆ పోస్టర్‌ను పెట్రోల్ టాంక్ దగ్గర అంటించకు. దాని పక్కన వాటర్ టాంక్ ఉంది చూడూ – అక్కడ అంటించు,'' అన్నాడు.

* * *

''వారం రోజుల క్రితం నేనో ఇంగ్లీష్ పిక్చర్ చూసి, కష్టపడి ఒక స్క్రిప్టు తయారుచేస్తే, ఆ ఫైల్‌ను కాస్తా ఎవడో కొట్టేశాడు.''

''వాడెవడో దొంగలకు దొంగ.''

* * *

''ద్విపాత్రాభినయం చేస్తూన్న సెట్‌లో ఆ స్టార్‌ని కలుసుకొని, కాల్‌షీట్లు అడగడం – చాలా పొరబాటై పోయింది.''

''అదేమిటండీ ?''

''ఒక పాత్ర ధరిస్తున్నప్పుడేమో 'కూర్చోండి. కాస్సేపట్లో చెప్తాను,' అంది. కాస్సేపయ్యాక రెండవ పాత్రలో నటిస్తున్నప్పుడు 'మీరింకా ఇక్కడే ఎందుకున్నారు ? కాల్‌షీట్లు లేవు, గీల్‌షీట్లు లేవు' పొమ్మంది.''

* * *

''ప్రెస్ మీట్‌లో ఆ కొత్త డైరెక్టరు తన చిత్రంలో ప్రతి ఫ్రేమ్‌లో తన ముద్ర కనబడుతుందని అలా బల్ల గుద్దినట్లు చెప్పాడేం ?''

''అతనింతకు ముందు పోస్టాఫీస్‌లో పని చేశాడట.''

* * *

''ఏమిటి – మీ చిత్రం నిన్ననే విడుదలైంది. అప్పుడే స్వర్ణోత్సవమని పేపర్లో ప్రకటన వేశారే ?''

''అది విడుదలైన థియేటర్లలోకెల్లా 'స్వర్ణ' థియేటర్‌లో మాత్రమే మొదటి ఆట హౌస్‌ఫుల్ అయింది అందుకని.''

* * *

''ఈవేళ కైలాసం సెట్‌లో మీ హీరో శివతాండవ నృత్యాన్ని అద్భుతంగా చేశాడండీ.''

''దానికి కారణముంది లెండి. నేనాయనకు ఇచ్చిన చెక్ కేష్ కాలేదు.''

* * *

''ఏమిటండీ ! డైరెక్టర్ ఎప్పుడు పిలిచినా ఆ కొత్త తార 'ప్రెసెంట్, సార్' అంటూ సెట్లోకి వస్తుందేమిటి ?''

''తను ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో ట్రెయినింగ్ అయిందని అదో బడాయిలెండి.''

* * *

''అతగాడు సెక్సీ చిత్రాల దర్శకుడైనంత మాత్రాన – కప్పులో టీ పంపిస్తే వద్దని–గ్లాసులో పంపించమంటాడా ?'' అని వాపోయాడు ఓ నిర్మాత.

—జి.వి.జి.

'నాంపల్లి నాగు'లో జ్యోతి లక్ష్మి ★……★ 'చట్టానికి కళ్లు లేవు'లో చిరంజీవి, మాధవి



# సినిమా

## సి. ఐ. డి. సికిందర్‌లో ప్రెస్ మీట్

పాత్రికేయులందరూ ఆసీనులయ్యారు. వాళ్ళ ప్రశ్న పరంపరలకు సినిమా స్టార్ లత (అంబిక) ఈ విధంగా సమాధానాలిచ్చింది

"డబుల్ కంగ్రాట్యులేషన్స్."

"దేనికండి ?"

"ఏమందీ ఒకటి జాతీయ స్థాయిలో ఉత్తమ నటి అవార్డు వచ్చినందుకు "

"థాంక్స్ "

"ప్రేమించినవాడ్ని పెళ్ళాడబోతున్నందుకు కంగ్రాట్యులేషన్స్ "

"ఎవర్ని ? అది కూడా మీరే చెప్పండి. పెళ్ళి కొడుకెవరో తెలియకుండానే పెళ్ళి న్యూస్ మీకు తెలిసిపోయిందన్నమాట ! రొమాన్సూ లేదు; పెళ్ళీ లేదు "

"ఏమీ లేదా ? లేకపోతే మీ బర్త్‌డే రోజున

కేక్ కోసి మొట్టమొదట ఎవరి నోట్లో పెట్టారో గుర్తుందా ?''

''ఆయన నా ఫాన్.''

''ఫానా? అతను మీ పక్కన ఏక్ట్ చేస్తున్నాడు. మీ కో ఆర్టిస్ట్ కదూ ?''

''కో ఆర్టిస్ట్ అయితే, ఫాన్ కాకూడదా ?''

''అయితే, అంతమంది ఫాన్స్ ఉండగా — ఆ ఒక్క ఫాన్ నోట్లోనే కేక్ ఎందుకు పెట్టారు ?''

''...... .. .....''

''ఫాన్ అంటే, శివరంజనిలో లాంటి ఫానా ? ఆ ఫాన్ అయితే ఆమెను పెళ్ళి చేసుకోవాలను కున్నాడు. ఆమె కూడా అతన్ని పెళ్ళి చేసుకోవాలను కుంది. అలాంటి ఫానా ?''

''ఏమండీ ! నాకు రికార్డింగ్ టయిమ్ అయిందండీ,'' అంటూ అత తప్పించుకొని, అందరికీ నమస్కరించి, బయలుదేరింది.

దాసరి కథ — స్క్రీన్‌ప్లే, దుర్గా నాగేశ్వరరావు దర్శకత్వంలో ఎస్. సాంబశివరావు నిర్మించే నవజ్యోతి పిక్చర్స్ ''సి. ఐ. డి సికిందర్'' చిత్రానికి కొంపెల్ల విశ్వం సంభాషణలకర్త. చక్రవర్తి, కె. ఎస్ హరి, భాస్కరరాజు, కందస్వామి ప్రభృతి సాంకేతికవర్గం.



'చిలిపి మొగుడు'లో దీప, కమల్ హాసన్ ★......★ 'బంగారు భూమి'లో కృష్ణ, శ్రీదేవి



'బంగారు కొడుకు'లో మోహన్‌బాబు, కృష్ణ ⌟ ⁂ ⌞'రామలక్ష్మణులు'లో కృష్ణంరాజు

## సినిమా

### మిస్టర్ విజయ్‌లో విజయ్ విజయం

సీత (జయంతి) గదిలోకి విజయ్ (శోభన్‌బాబు)కాస్త కంగారుగా వచ్చాడు. "వదినా, నీ దగ్గర డబ్బేమైనా ఉందా? మినిమమ్ ఆరువందల యాభై రూపాయలు కావాలి. ఓ ఇంపోర్టెడ్ టెన్నిస్ రాకెట్ చీప్‌గా వచ్చింది. తీసేసుకున్నా—డబ్బులివాళ ఇస్తానని ..."

"కెనాట్ గేరంటీ ... దైవాధీనం," అంటూ సీత అప్పటికి పెదవి విరిచినా — ఆ తర్వాత ఇదే విషయాన్ని తన భర్త అజయ్ (జగ్గయ్య)తో చెప్పింది. అందుకు అజయ్ "వాడేం లండన్ వెళ్లి



'వాడని మల్లి'లో ఒక దృశ్యం

వింబుల్డన్ గెలవక్కర్లేదు ... చూడూ — డబ్బు ఖర్చుపెట్టడం కాదు; సంపాదించడం నేర్చుకొమ్మని చెప్పు మీ మరిదిగారికి...పద, టిఫిన్ వడ్డిద్దువుగాని," అన్నాడే కాని, ఆ తర్వాత తమ్ముడ్ని పిలిచి, "అసలు నీ ఉద్దేశ్యం ఏమిటి? డబ్బో గిబ్బో కావాలనుకుంటే— డైరెక్ట్‌గా నన్నే అడగొచ్చుగా? మనిద్దరం అన్నదమ్ములం. మధ్యనొచ్చింది— ఈ విడెవరని మధ్యవర్తిత్వం నడపడానికి? చెక్కుమీద సంతకం పెట్టే ఉంది. రాసుకో!" అన్నాడు.

సీత గొల్లున నవ్వింది.

"ఇదుగో ... నువ్వు నవ్వొద్దు," అన్నాడు అజయ్.

ఇంతలో జ్యోతి (అంజు) "సక్సస్...సక్సస్! విజయ్ బాబాయికి దిగ్విజయం," అంటూ వచ్చి, మెల్లగా విజయ్‌కి డబ్బు ఇచ్చింది.

"రేయ్, నా చెక్ ఇచ్చేయ్," అన్నాడు అజయ్.

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.



'సుబ్బారావుకి కోపం వచ్చింది'లో నారాయణరావు

## ఇరుగు - పొరుగు

★ "చట్టానికి కళ్ళులేవు" షూటింగ్‌లో లక్ష్మి "పదిహేనేళ్ళుగా వీణ ప్రాక్టీస్ చేస్తున్నాను. త్వరలోనే కచ్చేరీలు ఇవ్వబోతున్నాను," అంది. ఈమె ఎనిమిది కుక్కలను పెంచుతోంది. అందులో ఒకటి జాగిలంలా భీకరంగా ఉంది. ఆ కుక్క రెండుసార్లు 'డాగ్స్ షో'లో బహుమతులు పొందిందట.

★ నటి శబ్నా అజ్మి ఒక హిందీ చిత్రానికి దర్శకత్వం వహించబోతోంది.

★ "వంశవృక్షం — అవార్డ్ వచ్చిన విషయం తెలిసినప్పుడు నేను పుట్టినరోజు పండుగ జరుపుకుంటున్నాను," అంది జ్యోతి "నాకు అవార్డ్ వస్తుందని నేను కలలో కూడా అనుకోలేదు. కాని షూటింగ్ సమయంలో ఎన్నోసార్లు డైరెక్టర్ బాపుగారు 'నువ్వు బెస్ట్ యాక్ట్రెస్ అవార్డ్ కొట్టేస్తావు చూడు,' అనేవారు. నాకు ఇన్‌స్పిరేషన్ కలిగించడానికి ఆయన అలా అనేవారేమో — అనుకునేదాన్ని. మొత్తంమీద ఆయన వాక్కు ఫలించింది," అందామె.

★ మలయాళ నటుడు స్వర్గీయ జయన్ జీవితంపై శ్రీకుమార్ తంబి అనే మలయాళ నిర్మాత ఒక చిత్రాన్ని తయారు చేయబోతున్నాడు. జయన్ నటించిన కొన్ని చిత్రాలలోని సన్నివేశాలు అందులో చేర్చబడతాయి. విలన్‌గా తొలుత సినిమారంగంలో ప్రవేశించిన జయన్‌ను హీరోగా చేసింది శ్రీకుమార్ తంబి.

★ గంటల ప్రకారం పారితోషికం తీసుకున్న పాకిస్థాన్ తార నదీమ్. "దుర్వాన్" చిత్రంలో నటించినందుకు ఒక గంటకు రూ 1,735-11 పైసల చొప్పున మొత్తం 71 గంటలకు పారితోషికం చెల్లించబడింది.

★ గాయకుడు జేసుదాస్ "వలయళ్" (గాజులు) అనే తమిళ చిత్రానికి తొలిసారిగా సంగీత దర్శకత్వం వహిస్తున్నాడు.

★ బొంబాయి వదిలి నటి రాధా సలూజా అమెరికాలో స్థిరనివాసమేర్పరచుకుంది. అక్కడామె ఒక ట్రావెల్ ఏజెన్సీ కంపెనీలో పని చేస్తోంది. అక్కడ తయారు కానున్న ఓ మలయాళ చిత్రంలో నటించబోతోంది కూడా.

★ "లవకుశుల"ని కవల పిల్లలకు పేర్లు పెట్టడం మంచిది కాదని చాలామంది శత్రుఘ్నసిన్హాకు తెలియజేశారు. వాళ్ళు సీత గర్భంలో ఉండగా తల్లిదండ్రులకు ఎడబాటు కలిగించారు గనుక ఆ పేర్లు మార్చమని సలహా ఇస్తే, "హిమాంశు, హిమచల్"గా తన పిల్లల పేర్లను శత్రుఘ్నసిన్హా మార్చేశాడు.

★ "ఏక్ దుజేకే లియే" చిత్రంలో కూడా రతి అగ్నిహోత్రికి డబ్బింగ్ తప్పలేదు. ఆమెకు జరీనాఖాదిర్ అనే వనిత సంభాషణలు పలికింది. ఆ చిత్రం ద్వారా కమలహాసన్, రతి పేర్లు మార్మోగినందుకు పలువురు హిందీ తారలు అసూయ చెందారు. కమల్ గురించి ఎక్కువగా ఈర్ష్య చెందింది శత్రుఘ్నసిన్హా "రతి ఇక్కడ ఎంతకాలం ఉంటుందిలే!" టీనా మునీమ్, పద్మినీ కొల్హాపూర్‌లు హేళనగా నవ్వేస్తుంటే, రతి మాత్రం "హేమమాలిని తర్వాత ఆమె స్థానాన్ని నేనే ఆక్రమిస్తాను," అంటోందట.

★ ముక్కు పొడుగ్గా ఉందని రాజాబబ్బర్‌కు ఆదిలో ఎందరో నిర్మాతలు అవకాశమివ్వలేదు. ఇప్పుడు అమితాబ్ బచ్చన్ తర్వాత అతనే బిజీ హీరో అయిపోయాడు.

## సినిమా

"అమ్మ అమ్మ...నువ్వు పారిపో, బాబాయ్," అని జ్యోతి అనడమే తడవుగా విజయ్ పరుగు లంకించుకున్నాడు. "ఒరేయ్, ఒరేయ్!" అంటూ అజయ్ వెంటబడేసరికి "స్టాట్యూ!" అంది జ్యోతి అజయ్ కదలకుండా బిగుసుకుపోయాడు. ప్రొఫెసర్ భగవంతం(గుమ్మడి)వస్తూ, "ఏరా అలా బిగుసుకు పోయి ఉంచున్నావు ?" అన్నాడు.

"స్టాట్యూ రిలీజ్ !" అంది జ్యోతి

విముక్తి చెందిన అజయ్ అర్థంలేని ఆవేశంతో "ఇదుగో, నాన్నా ! మీరు విజయ్ అడిగినంత డబ్బిచ్చి, వాడ్ని చెడగొడుతున్నారు," అన్నాడు.



'మరో కురుక్షేత్రం'లో భానుచందర్

"నేను విజయ్‌కి డబ్బెక్కడిచ్చాను ? పాప ఐస్‌క్రీమ్ కొనాలంది," అన్నాడు భగవంతం.

"ఐస్‌క్రీమ్ కొనడానికి అరువందల యాభై రూపాయలిచ్చారా ?"

అప్పటికిగాని భగవంతంకు జ్యోతి వేసిన ఎత్తు బోధపడలేదు "జ్యోతి తల్లీ ! ఇదుగో " అంటూ దగ్గరికి రాబోగా "స్టాట్యూ !" అంది జ్యోతి భగవంతం బొమ్మలా నిలబడిపోక తప్ప లేదు జ్యోతి తుర్రుమంది

సమతా మూవీస్ "మిస్టర్ విజయ్" చిత్రాన్ని ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో కె. ఛటర్జీ నిర్మిస్తున్నారు 

"బడికి వెళ్లే పిల్లల్లో పదింట ఏడుగురికి పిప్పి పళ్లున్నాయి."

—స్కూల్ సర్వే, మార్చి 1978
ఇండియన్ డెంటల్ అసోసియేషన్



పంటి నొప్పి దంత క్షయానికి సూచన. మీ నోటిలో ఉండే సూక్ష్మజీవులు ఆహారపు తునకలను హానికరమైన ఆమ్లాలుగా మారుస్తాయి. ఆ ఆమ్లాలు మీ పళ్లమీద దాడిచేసి వాటిని నొప్పి కలిగించే పిప్పి పళ్లుగా మారుస్తాయి.

# వాడండి ఫ్లోరైడగల సిగ్నల్ 2

# పిప్పిపళ్లను అరికట్టేది

ఫ్లోరైడ్ గల సిగ్నల్ 2 దంత క్షయాన్ని రెండు విధాలుగా అరికడుతుంది: పిప్పి పళ్లకు కారణమైన నోటి ఆమ్లాలను తయారుచేసే సూక్ష్మజీవులను నిరోధిస్తుంది, పంటి ఎనామెల్‌తో కలిసి దాన్ని మరింత గట్టి పరుస్తుంది—పిప్పి పన్ను కాకుండా, మరింత బాగా నిరోధించ గలిగేలా. దానికి కారణం, పిప్పి పళ్లు కాకుండా చూసే ప్రత్యేక పదార్థం ఫ్లోరైడ్, అద్వితీయమైన సిగ్నల్ సూత్రీకరణలో అత్యుత్తమంగా పనిచేయడమే.

ఇప్పుడే—మరీ ఆలశ్యం కాకుండానే—తెచ్చుకోండి సిగ్నల్ 2. అది మీ కుటుంబంలోని వారి పళ్లు పిప్పి పళ్లు కాకుండా కాపాడుతుంది.




పిప్పి పళ్లను నిరోధించడంలో మరే టూత్‌పేస్టూ దీనికి సాటిరాదు.

హిందూస్థాన్ లీవర్‌వారి విశిష్ట ఉత్పత్తి.

LINTAS-SG2-23-2315 TL

## 2

# సీరియల్

# సాగర మథనం

## మాలెళ్ళ ఉమాదేవి

(గత సంచిక తరువాయి)

రెండు సంవత్సరాల క్రితం —

యం.కాం. పాసైన వెంటనే అరకాపల్లి జూనియర్ కాలేజీలో లెక్చరర్ ఉద్యోగం వచ్చింది రవికి. చాయిన్నైన పది రోజులకే దసరా సెలవులివ్వడంతో ఇంటికి రాజమండ్రి వెళ్ళిపోయాడు. ఇంకో రెండు రోజులు సెలవులున్నాయనగా వూడిపడ్డాడు రవి మేనమామ పరంధామయ్య.

పరంధామయ్యంటే ఆ ఇంటిలో అందరికీ గౌరవం. అతనుండేది రావులపాలెం దగ్గర ఒక పల్లెటూర్లో. చిన్నతనం నుండీ పల్లెటూర్లోనే వుంటూ వ్యవసాయం చేసుకుంటున్న పరంధామయ్య మోటుగా వుంటాడు. అతని మాటలూ మోటుగానే వుంటాయి. రవికి పరంధామయ్యంటే చచ్చేంత భయం.

ఆ రోజు భోజనాల దగ్గరన్నాడు పరంధామయ్య — "వీడికో మంచి సంబంధం చూసానమ్మా."

రవికి మామయ్యపక్కన కూర్చోడమంటేనే దిగులుగా వుంటుంది. దానికి తోడు పెళ్ళి గూర్చి ప్రస్తావన వచ్చేసరికి నీరుగారి పోయాడు.

"వాడు యింకా మొన్ననేకదా ఉద్యోగంలో చేరింది. అప్పుడే తొందరెందుకన్నయ్యా?" అంది జానకమ్మ వడ్డిస్తూ.

"అవునోయ్. అప్పుడే ఏమొచ్చిందని తొందర పడడం?" అన్నారు రఘుపతిగారు భార్య మాటకి వంత పలుకుతూ. రవి తల్లి దండ్రులకు మనస్సులోనే జోహార్లర్పించాడు.

"ఒహో! నీ కోర్టులూ, కేసులూ కాక కుర్రాడి పెళ్ళిపెడాకులు కూడా పట్టించుకునే తీరిక చిక్కినట్టుందే నీకు!" అన్నాడు పరంధామయ్య మండిపడుతూ. నిజానికి ఆ యింటి మంచి చెడ్డలు రఘుపతి కంటే పరంధామయ్యే ఎక్కువగా చూస్తూవుంటాడు. జానకమ్మ అతనికి ఒక్కగానొక్క చెల్లెలు. రఘుపతిగారు ఎప్పుడూ తన కోర్టులూ, కేసులూ తప్ప యింటి విషయాల్లో ఎక్కువగా జోక్యం చేసుకోరు బహుశా జానకమ్మ వివాహం జరిగిన నాటినుండి పరంధామయ్య ఆ యింటి బాధ్యతలని ఎక్కువగా భుజాన వేసుకోవడం వలన రఘుపతికా అవకాశం కలగలేదేమో!

"అదికాదు మామయ్యా, పెళ్ళి చేసుకోవాలంటే నేను నా కాళ్ళమీద నిలబడాలిగా." అన్నాడు రవి జంకుతూ.

మండిపడ్డాడు పరంధామయ్య, "నోరు మూసుకోవోయ్. ఇప్పుడు నీ కాళ్ళమీద నువ్వు, నిలబడితేనేకాని నీ పెళ్ళాన్ని పోషించలేవా ఏమిటి? మేమంతా వున్నదెందుకు? గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందట! నువ్వుకూడా నాకు చెప్పొచ్చావ్. చూడు చెల్లాయ్, నేను వాళ్ళకి మాటిచ్చేసాను అబ్బాయిని తీసుకుని వస్తానని. రేపు వీడు నాతో బయలుదేరక తప్పదు."

పరంధామయ్య అలా దృఢంగా అన్నాడంటే యిక అతని మాటకెదురు చెప్పే ధైర్యం ఎవ్వరికీ లేదు యింటిలో.

"అలాగేలే అన్నయ్యా. ఇంతకీ ఏ ఊరి సంబంధం?" అంది జానకమ్మ.

"వాళ్ళది విశాఖపట్నం. అతను వ్యాపారం చేస్తూ లక్షలు గడించాడు. ఒక్కర్తే కూతురు.

> **జరిగిన కథ 1:** ఓ కాలేజీలో లెక్చరర్‌గా పని చేస్తుంటాడు రవీంద్ర. తన స్టూడెంట్ కవిత ఇంట్లో ఓ పోర్షను అద్దెకు తీసుకుంటాడు. మిత్రుడు శంకరంతో కలసి సినిమాకి వెళ్ళిన అతనికి ఆ హాల్లో ఎకనమిక్స్ లెక్చరర్ గోపీనాథ్ ప్రక్కన కూర్చున్న యువతిని ఎక్కడో చూసినట్లు జ్ఞాపకం.

కొడుకు లెవ్వరూ లేరు. అమ్మాయి పోత పోసిన పాలరాతి విగ్రహంలా వుంటుంది." అన్నాడు పరంధామయ్య.

"రవికి నచ్చితే మన అభ్యంతరం మాత్రం ఏముంటుంది?" అన్నాడు రఘుపతి.

"వాడి మొఖం! అంతకన్నా చక్కని పిల్ల వీడి కెక్కడ దొరుకుతుంది." అన్నాడు పరంధామయ్య పెరుగు కలుపుకుంటూ.

రవి భోజనం ముగించి చెయ్యి కడిగేసుకుని లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

"ఏమిటమ్మా, మామయ్య దురుసుతనం మరీ ఎక్కువౌతోంది!" తల్లి ఒంటరిగా భోజనం చేస్తూండడం చూసి అన్నాడు రవి.

రఘుపతీ, పరంధామయ్యా మాటల్లో పడ్డారు రఘుపతి ఆఫీసు గదిలో.

"అన్నయ్య మాట దూకుడుగా వున్నా, మనసు వెన్నలాంటిదిరా... చిన్నతనంనుండీ నువ్వు చూస్తూనే వున్నావుగా మనమంటే వాడికెంత అభిమానమో! అయినా యిప్పుడేమైందని? ఏదో మంచి సంబంధం అంటున్నాడు. ఒకసారి వెళ్ళి చూసి వచ్చేయ్. నువ్వెలాగూ ఎల్లుండి అరకాపల్లి వెళ్ళి పోవాలిగా. విశాఖ వెళ్ళి అక్కడనుండి అలా నీ కాలేజీ వూరు వెళ్ళిపో." అంది జానకమ్మ.

"వెళ్ళిపో అంటున్నావ్. నువ్వు రావా ఏమిటి?"

"నేనెందుకురా యిప్పుడు? నువ్వు చూసిన తర్వాత నీకు నచ్చిందని రాస్తేనేమా నాన్నగారూ వెళ్ళి చూసి వస్తాం" అంది జానకమ్మ చెయ్యి కడుక్కుంటూ.

రవి గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయ్. మామయ్యతో వెళ్ళడం అంటే ఒక గండంలా వుందతనికి. 'మీ నాన్నగారున్నారా అనడానికి బదులు, మీ అమ్మ మొగుడున్నాడా?' అనే రకం మామయ్య. అక్కడేం యిన్సల్ట్ చేస్తాడో అనుకుంటూ పెళ్ళి చూపులకి బయలుదేరాడు రవి పరంధామయ్యతో.

సీతమ్మధారలో కొత్తగా కట్టిన ఒక భవంతి ముందు ఆటోలోంచి దిగారు మామా, అల్లుడూ. 'వ్యాపారంలో బాగా సంపాదించాడ'ని మామయ్య చెప్పడం నిజం లాగే వుంది అనుకున్నాడు రవి ఆ భవనం చూసి.

ఇంటికి చుట్టూ పలుచని ప్రహారీగోడా, గోడకానుకుని సుమారు ఎనిమిదేసి అడుగుల ఎడంలో అందంగా పెరిగిన అశోక వృక్షాలూ — ఆ భవనానికో ప్రత్యేకమైన అందాన్ని చేకూరుస్తున్నాయి. వెడల్పాటి ఐరన్ గేటుకి

'కుక్కవున్నది జాగ్రత్త' బోర్డు చూడగానే రవి కాళ్ళు వణకడం మొదలెట్టాయ్. 'ఈ కుక్కల పెంపకం అలవాటు ఒక పెద్ద జబ్బులా వ్యాపించింది. నాలుగు డబ్బులు సంపాదించేసరికి ఒక కుక్కని పెంచేసుకుని 'కుక్కవున్నది జాగ్రత్త' బోర్డు తగిలించేసుకుంటారు. మనుషుల హోదాని చాటి చెప్పేందుకు ఈ పెంపుడు కుక్కలదే ప్రధాన పాత్రేమో!' కుక్కలు పెంచేవారినందర్నీ మనసులో తిట్టుకుని గేటు తెరుచుకుని లోపలకి నడిచాడు రవి మామయ్య వెంటరాగా. ఆ భవనానికి కుడివైపు కారు గేరేజ్ — అందులో పదిలంగా వుంది 'పద్మినీ ప్రీమియర్' పాలరాతి రంగులో. ఎడమవైపు వృత్తాకారంలో పచ్చటి తివాసీ పరచినట్టుగా పెరిగిన లాన్, లాన్ చుట్టూ రంగు రంగుల పూలు పూస్తున్న చిన్న చిన్న పూల మొక్కలూ—'మంచి టేస్టే' అనుకున్నాడు రవి.

వీరిద్దరినీ సాదరంగా ఆహ్వానించి హాల్లో కూర్చోపెట్టారు తెల్లపంచె, లాల్చీలో వున్న ఆ ఇంటి యజమాని. ఖరీదైన పెద్దసోఫాలో ఒంటరిగా కూర్చున్నాడు రవి. అతనికెదురుగా ఆసీనులయ్యారు పరంధామయ్యా, తెల్లపంచె ఆసామీ.

''ఛ! నేనింతగా భయపడి పోతున్నానేమిటి? నేను వచ్చింది పిల్లని చూడడానికి కాని యింటర్వ్యూకి కాదు.'' తనలో తనే అనుకుని నిబ్బరంగా వుండేటట్టు కనిపించేలా కాలుమీద కాలు పెట్టుకుని కూర్చున్నాడు. రవి ఎదుట గుమ్మంవైపు అప్పుడప్పుడూ చూస్తున్నాడు. 'మామయ్య మాట నిజమైతే ఒక తెల్లటి, అందమైన అమ్మాయి అడుగులో అడుగు వేసుకుంటూ ఆ గుమ్మంలోంచే రావాలి' అనుకుంటున్నాడు.

ఇంతలో – 'డాడీ' అంటూ మెరుపులా దూసుకువచ్చిందో అమ్మాయి.

''ఇలా కూర్చోమ్మా'' అన్నారు తె. ప. ఆసామీ.

''ఈయన పరంధామయ్యగారు. రాజమండ్రి దగ్గరుంటున్నారు.'' ఆయనే









అన్నారు పరంధామయ్యని చూపిస్తూ ఆ అమ్మాయితో.

"నమస్తే!" అంది ఆ మెరుపుకన్య చేతులు జోడిస్తూ.

రవి ఆమెనే గమనిస్తున్నాడు. అతని ఊహలన్నీ తారుమారయ్యాయ్. అమ్మాయి తెల్లగా ఓ మాదిరిగా వుంటుందనుకున్నాడు కాని అంత అందంగా వుంటుందనుకోలేదు. తల వంచుకుని సిగ్గుపడుతూ వస్తుందనుకున్నాడు కాని అలా దూసుకుని వస్తుందనుకోలేదు.

"యితను రవీంద్ర. అనకాపల్లి జూనియర్ కాలేజీలో లెక్చరర్‌గా వుంటున్నాడు." అని రవిని పరిచయం చేసి, "మా అమ్మాయి, సుధ." అన్నాడు ఆ ఆసామీ రవితో.

"హలో." అని నవ్విందామె.

"హలో." అని మాత్రం అనగలిగేడు రవి.

"డాడీ, నేనెందుకు పిలిచారు ?" అంది సుధ తండ్రితో.

"ఏం లేదమ్మా. గెస్ట్స్ వచ్చారు కదా. ఏమైనా సెర్వ్ చెయ్యవూ!" సుధతో అని, "మా ఆవిడ నిన్న అర్జంటుగా భీమిలి వెళ్ల వలసి వచ్చింది." అన్నారు పరంధామయ్యతో.

సుధ వెళ్లిపోయిన తర్వాత ఆ హాలంతా చిన్నబోయినట్టనిపించింది రవికి. సమున్నతమైన తెలుపు మిళితమైన రంగు శరీరం, ఎటువంటి ప్రవరాఖ్యుడినైనా మైమరపించే అందమైన మొహం, 'ఈ అందానికంతటికీ మేమేనోయ్ కారణం' అంటున్నట్టుగా మెరిసే ఆ చురుకైన కళ్లూ – 'థాంక్స్ మామయ్యా! పెళ్లి మాటెలావున్నా యింతటి అందాన్ని చూసే భాగ్యాన్ని కలిగించినందుకు.' అనుకున్నాడు రవి.

# సాగర మథనం

సుధ కాఫీ ట్రే తీసుకురాగా, ఆమె వెనక పన్నెండేళ్ల పిల్లడొకడు ఆపిల్ ముక్కలూ, బిస్కెట్లూ వున్న నాలుగు ప్లేట్లు తెచ్చి వారి కెదురుగా వుంచాడు. వాళ్ల వెనకనే బాగా బలిసిన గోధుమ రంగు కుక్క తోకాడిస్తూ వచ్చింది. కొత్త వ్యక్తులిద్దర్నీ ఒకసారి తీక్షణంగా చూసి 'భౌ భౌ' మంటూ మొరగడం మొదలెట్టింది. అది ఏ క్షణంలో మీద పడుతుందోనని బిత్తరపోయి చూస్తున్నాడు రవి.

"హనీ, గో అవుట్." అని సుధ కసరడంతో తోకాడిస్తూ వీధిలోనికి వెళ్లి పోయింది.

"అబ్బాయి ఎన్నాళ్లనుండి అనకాపల్లిలో వుంటున్నాడు ?" అన్నాడు తె. ప. ఆసామీ కాఫీ చప్పరిస్తూ.

'ఇదేమిటి ? అమ్మాయి గూర్చి వివరాలు చెప్పడం పోయి నా గూర్చి అడుగుతున్నాడు ! ఈ అమ్మాయి కూడా యింత యిండిఫరెంట్‌గా వుంటోందేమిటి ? పెళ్లిచూపులన్న సంగతే తెలియదా ? లేక తెలిసే యిలా నిబ్బరంగా వుంటోందా ? ఎంతైనా హోం గ్రౌండ్ కదా. వీళ్లదే డామినేషన్‌లా వుంది.' తనలో తనే అనుకున్నాడు కాఫీ తాగుతూ రవి.

"ఒక నెల మాత్రమే అయింది. వాడుత్త అమాయకుడు వెధవనుకోండి. ఒంటరిగా హోటల్లో భోజనం చేస్తూవుండడం కష్టం కదుటండీ. అందుకని ఎవర్నో ఒకర్ని ముడి పెట్టేస్తే మన బాధ్యతా తీరిపోతుంది. వాడికీ యిబ్బంది వుండదు. అబ్బాయి చాలా బుద్ధిమంతుడు. ఇంత చదివినా ఒక్క దురలవాటంటూ లేదు" పరంధామయ్య చెప్పుకుపోతున్నాడు.

"అంటే చదువుకున్న వాళ్లకి ఖచ్చితంగా దురలవాట్లుంటాయంటారేమిటి?" అన్నాడు నవ్వుతూ తె. ప. ఆసామీ.

"అబ్బే! అది నా ఉద్దేశం కాదండీ. ఒక్క సిగరెట్టు ముక్కైనా వీడు కాల్చడు. రోజులు మంచివి కావు. ఒంటరిగా కొన్నాళ్లుంటే ఎక్కడలేని అలవాట్లూ వంట పడతాయ్. అందుకే వాడు ఇప్పుడే చేసుకోనని గీ పెడుతున్నా మెడలు వంచి మరీ చేస్తానని చెప్పాను" అన్నాడు పరంధామయ్య వీరుడిలా పోజ్ పెడుతూ.

'అయ్యో! అనుకున్నదంతా జరిగింది ! ఈ మోటు మనిషి పరువంతా తీసి యిక్కడ పరిచేసాడు. ఈ అమ్మాయి ప్రాయంలోనే వున్న ఎంతోమంది అమ్మాయిలచేత నమస్కారాలు పెట్టించుకుంటున్న ఈ రవీంద్ర, యం.కాం.ని, ప్లేట్లు తీసుకుని వచ్చిన పిల్లాడి గూర్చి మాట్లాడినట్టుగా మాట్లాడి చిత్రహింస చేసావు మావయ్యా' కుంచించుకు పోయాడు రవి.

సుధ తనలో తనే నవ్వుకోవడం గమనించాడు రవి.

'ఛీ! దుర్యోధనుడు మయసభలో పొందిన అవమానం కంటే వందరెట్ల అవమానం భరించవలసి వచ్చింది' అనుకున్నాడు. 'సుయోధన పరాభవం' ఏకపాత్రాభినయం చేసి రెండుసార్లు ప్రైజు కొట్టేసిన రవి.

అందమైన ఆ అనుభవాన్నీ, ఘోరమైన ఈ పరాభవాన్నీ సింహావలోకనం చేసుకుంటూ తన వూరు చేరుకున్నాడు. ఓ వారం రోజులు గడచిన తర్వాత 'అమ్మాయి యింకా చదువు

కుంటుందంట. అప్పుడే పెళ్లి చేసుకోదట' అంటూ పరంధామయ్య దగ్గరనుండి ఉత్తరం వచ్చింది.

* * *

ఆనాడు తనకు భార్య కావలసిన మధ గోపీనాథ్‌కి భార్య అయిందా ? తన సొత్తుని గోపీనాథ్ దొంగిలించాడనిపించింది రవికి.

మధని తలచుకుంటూ నిద్రలోకి జారి పోయాడు.

3

ఆ రోజు ఉదయానే అద్దె యింటికి బయలుదేరాడు రవి. శంకరం భార్య సుగుణ పాలు పొంగించడానికి వస్తానంది. కాని ఆమె ఆ రాత్రే వచ్చింది కనుక రవి వారించాడు. 'సొంత యింటికి కొత్తగా వెళ్తున్నానా ? లేక ఏదో ఫామిలీని వెంటపెట్టుకుని వెళ్తున్నానా ? నా కెందుకండీ ఈ ఫార్మాలిటీలన్నీ' అన్నాడు రవి సుగుణతో.

తను వచ్చిన మర్నాడే వెళ్లిపోతున్నాడని సుగుణ నొచ్చుకుంది. ఆ ఆదివారం తప్పకుండా వచ్చి రోజంతా వుంటానని ప్రామిస్ చేసాడు రవి.

ఆటోరిక్షాలో శంకరం కూడా బయలు దేరాడు రవితో. మరో ఆటోలో బెడ్డింగూ, పెట్టెలూ, చిన్న చిన్న సామాన్ల పేకెట్లూ జాగర్తగా సర్దించాడు శంకరం.

శంకరం, రవిలు ఆటో దిగగానే ఎదురొచ్చి ఆహ్వానించింది కవిత. గదులన్నీ కడిగి ముగ్గులు పెట్టి వున్నాయి. సాలెగూళ్లతో నిండి వున్న గదులు అంత క్లీన్‌గా వుండడం చూసి ఆశ్చర్యపడ్డాడు రవి.

"గదులను చూస్తూవుంటే మీరు చాలా శ్రమపడినట్టనిపిస్తోంది." అన్నాడు రవి కవితతో.

సామానులు దించి ఆటోరిక్షావాళ్ళు వెళ్లిపోయారు.

కవిత వాళ్ల యింటినుండి రెండు ఫోల్డింగ్ కుర్చీలు తెచ్చి ముందు గదిలో వేసి వాళ్లిద్దర్నీ కూర్చోమంది. శంకరాన్ని పరిచయం చేసాడు రవి.

"ఇకనుండి యిది నా యిల్లు కనుక నేను కూర్చోమనాలి. కూర్చోవోయ్." అన్నాడు శంకరంతో నవ్వుతూ.

కవిత స్టూలు తీసుకుని రావడం చూసి "యిదెందుకండీ ?" అన్నాడు రవి.

"ఇప్పుడో చిన్న కార్యక్రమం వుంది. అదిగో మా బామ్మ చెప్తోంది." అనేసి వెళ్లిపోయింది కవిత.

"కొత్తగా దిగుతున్నావు కదు బాబూ — అందుకని మా కవితచేత కొంచెం పాలు పొంగించేస్తాను." బామ్మగారు చిన్న స్టీలు గిన్నెలో పాలు తీసుకుని వచ్చారు.

"చూశావా? మేం చెబితే కొట్టిపారేసావ్." అన్నాడు శంకరం నవ్వుతూ.

అంత మంచి యింటిగలవాళ్ళు దొరికినందుకు రవి లోలోపల సంతోషించాడు. పాలు పొంగించడం పూర్తి అయిన తర్వాత కవిత యిద్దరికీ కాఫీలిచ్చింది. శంకరంతోపాటు రవి కూడా లేచాడు కాఫీ తాగడం పూర్తి అయ్యాక, కాలేజీ టైమవ్వడంతో.

"మాష్టారూ! ఈ రోజు మీ క్లాసుకి సెలవు పెడుతున్నాను, మీ సామానులు సర్దడంకోసం" అంది కవిత రవి వెనుకనే వస్తూ.

# సాగర మథనం

"ఎందుకండీ, మీకనవసరపు శ్రమ! మధ్యాహ్నం నేను వచ్చాక సర్దుకుంటాను" అన్నాడు రవి మొహమాటంగా మొఖంపెట్టి.

"ఫర్వాలేదండీ. నేనెలాగూ ఈ రోజు కాలేజీకి వెళ్లదలుచుకోలేదు. వంట్లో కూడా కొంచెం మస్తీగా వుంది" అంది కవిత.

* * *

ఆ మధ్యాహ్నం రవి యిల్లు చేరేసరికి రెండయింది. గదులన్నీ నీటుగా సర్ది వుండడం చూసి 'ఈ అమ్మాయికి బాగా ఋణపడిపోతున్నాను" అనుకున్నాడు.

ముందు గది కిటికీ పక్కగా టేబిలూ, దానిమీద యిస్త్రీ చేసిన క్లాత్ వేసివుంది. రవి 'టూ యిన్ వన్ సెట్' టేబిల్‌మీద అమర్చబడింది. దానికి ఒక పెద్ద పువ్వూ, రెండు చిన్న పువ్వులూ రంగు రంగు దారాలతో కుట్టిన తెల్లటి గుడ్డ కవర్ వేయబడి వుంది. కిటికీకి సగం వరకూ కర్టెన్, కిటికీ పక్కన గాజు బీకర్‌లో నీళ్లుపోసి వుంచిన మనీప్లాంట్ — ఎంతో ఆకర్షణీయంగా వున్నాయి. టేబిల్‌కి కొద్దిగా పైన గోడకి అజంతా తైల వర్ణచిత్రం ఒకటి అమర్చి వుంది. ఉదయం తెచ్చిన కుర్చీలు రెండూ టేబిల్ పక్కన వేసివున్నాయి. మధ్య గదిలో కేంప్ కాట్‌మీద పక్క సర్దబడివుంది. మంచానికి ఎదురుగా రాధాకృష్ణుల పటం వేళ్లాడుతోంది. రవి పెట్టెలు మంచం వెనుక దొంతర వేసివున్నాయి.

"వచ్చేసారే" అంటూ వచ్చింది కవిత. ఆమె కొంత అలిసినట్టు కనిపించింది రవికి.

"కవితగారూ, మీరు చాలా శ్రమపడ్డారు. మీకు చాలా ఋణపడిపోతున్నాను." అన్నాడు నొచ్చుకుంటూ.

"మాష్టారూ, నేనో మాట చెప్తాను వింటారా ?" అంది కవిత చిత్రంగా కళ్ళు తిప్పుతూ.

"తప్పకుండా."

"నేను మీకన్నా కనీసం ఒక్క రోజైనా చిన్న అయివుంటాను. కనుక మీరు నన్ను 'కవితగారూ' అనకుండా 'కవితా' అనండి చాలు."

"అలాగే. మీరు చెప్తున్నారు కనుక నా స్టూడెంట్ కనుక ఒప్పుకుంటున్నాను."

"అదిగో! మళ్లా 'మీరు' అంటున్నారు!"

"క్షమించండి కవితా. చిన్నవారైనా మిమ్మల్ని అలాగే పిలవనివ్వండి."

"మీ యిష్టం." అంది కవిత నిర్లిప్తంగా.

"మీరు అద్దెకిచ్చింది ఒక్క యిల్లు మాత్రమే, మరి ఈ చెయిర్సూ, టేబిలూ — వీటికి రెంట్ ఎంత ?" అన్నాడు నవ్వుతూ.

"ఆ టేబిల్ మీద నాకు తెలియని ప్రాబ్లమ్స్ ఏమైనా వుంటే మీరు చెప్పాలి. అదే రెంట్!" నవ్వింది కవిత.

"ఓకే! అగ్రీడ్."

"అమ్మాయీ, సుధొచ్చిందే." అంటూ బామ్మగారు వచ్చారు.

"ఓహో! యీవిడగారికి యిన్నాళ్లకి తీరిక చిక్కినట్టుంది. ఇప్పుడే వస్తాను మాష్టారూ." అంటూ హడావిడిగా వెళ్లిపోయింది.

**(ఇంకా వుంది)**

## ఎక్స్‌పో - 85

జపానులోని సుకూబా నగరంలో ఇంటర్నేషనల్ ఎక్స్‌పొజిషన్ ప్రదర్శనము 1985 లో నిర్వహించనున్నారు. ఇటీవల బ్యూరో అఫ్ ఇంటర్నేషనల్ ఎక్స్‌పొజిషన్‌వారు ఈ ప్రదర్శనకు గుర్తింపునివ్వాలని నిర్ణయించారు. జపానులో యిటువంటి ప్రత్యేక ప్రదర్శనను నిర్వహించడం యిది రెండవసారి! గతంలో ఓకినావా నగరంలో 1975లో 'ఎక్స్‌పో 75' ప్రదర్శనను నిర్వహించారు. సైన్సు, సాంకేతిక రంగాలకు మానవ జీవితంతోనూ, పరిసరాలపై కలుగచేస్తున్న ప్రభావంతోనూ గల సంబంధాన్ని ప్రత్యేకంగా వివరించడమే యీ "ఎక్స్‌పో 85" యొక్క ప్రధానోద్దేశ్యం. మానవజాతికే సమస్యగా తయారైన సరైన మనుగడను సాధించటానికి యీ ప్రదర్శనలో కృషి చేస్తారు. జపానులోని పరిశోధక సంస్థలకు చెందిన సగంమంది శాస్త్రజ్ఞులు యిప్పటికే సుకూబా నగరాన్ని చేరుకున్నారు. సుకూబా నగరానికి ప్రక్కనే వున్న 100 హెక్టేర్ల మైదానంలో యీ ప్రదర్శనను నిర్వహిస్తారు.



# ప్రవేశపెడుతోంది
# కొత్త
# బోనస్ బనియన్

**సుఖ అనుభూతి**
**ఎక్కువ మన్నిక**
**తక్కువ ధర**

వి ఐ పి బోనస్ ఎక్స్‌ట్రా-ఫైన్ బనియన్. 'వైటెక్స్', 'సాఫ్టెక్స్' పద్ధతుల తాలూకు ప్రయోజనాలన్నీ ఇప్పుడు అనువైన ధరల్లో. సుఖానుభూతి కోసం తొడుక్కోండి వి ఐ పి బోనస్ బనియన్ — భుజాలూ, చేతులూ సాగిపోవు. అందం కోసం, మన్నిక కోసం ఇది మెర్సెరైజ్డ్ దారంతో కుట్టబడింది.

హెచ్చు ధర
లేకుండానే
హెచ్చు మృదుత్వం



శ్రేష్ఠమైన లోతొడుగుల కల్పనలో
అందెవేసినవారు

CASHH-3 234 TEL

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్సు : మహవీర్ ఏజన్సీస్, 4-1-938, తిలక్ రోడ్డు, హైదరాబాద్-500001.

# హైదరాబాద్ నోట్ బుక్

— తిరుమల రామచంద్ర

## ఎన్నికల రాకడ :

వాన రాకడ, ప్రాణం పోకడ ఎవరికీ తెలియవని సామెత. ఎన్నికల రాకడ, ప్రభుత్వాల పోకడ ఎవరు చెప్పగలరని పై సామెతను ఆధునీకరించాలి. రాష్ట్రంలో ఎన్నికల సంరంభం ఆరంభం కావడం చూస్తుంటే. మధ్యంతర ఎన్నికలు రాష్ట్రంలో 1982లో పెట్టినా, 1983లో పెట్టినా తాము సిద్ధంగా వున్నట్లు ఎన్నికల కమిషనుకు తమ పార్టీ తెలియ చేసినట్లు ముఖ్య మంత్రి శ్రీ అంజయ్య ఆగస్టు 12న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో అన్నారు. ఎన్నికలకు సర్వసన్నద్ధంగా ఉండాలని ఇందిరా కాంగ్రెస్ విధాన సభ పార్టీ కార్యవర్గం కూడా తీర్మానించింది. శ్రీమతి గాంధి ఫోటోతో రూపాయి కూపన్లు ముద్రించి పార్టీ నిధిని వసూలు చేయడానికి నిర్ణయించినట్లు కూడా ముఖ్య మంత్రి చెప్పారు. నియోజక వర్గానికి 50వేలు వసూలు చేసినా కోటిన్నర పైగా నిధిని వసూలు చేయవచ్చు. ఇందిరా కాంగ్రెస్ అభిమానులయిన వ్యాపారస్తులు, పారిశ్రామికులు కొంచెం చేయి సడలిస్తే, ఐదారు కోట్ల నిధి చేకూరుతుంది.

## రాజలక్ష్మి అవార్డులు :

ఈసారి రాజలక్ష్మి ఫౌండేషన్ అవార్డులు ఒక నాట్యాచార్యుని, ఒక ధ్వన్యనుకరణ నిపుణుని వరించాయి. వీరికి చెరి పది వేల రూపాయలు బహూకరిస్తారు. నాట్యాచార్యుడు శ్రీ వెంపటి చిన సత్యం ఈయన విఖ్యాత కూచిపూడి నాట్య శాస్త్రజ్ఞుడు. కూచిపూడి ఆర్ట్ ఆకాడెమీ డైరెక్టర్. కళాప్రపూర్ణ బిరుదాంచితుడు. కుమారి చంద్రకళ, యామినీకృష్ణమూర్తి, కె. శోభానాయుడు, కాంచన, జి. బాల, కె. పద్మ, హేమమాలిని, రీటా దేవి [అమెరికా] మున్నగు ప్రముఖ నర్తకీ మణులు ఈయన అంతేవాసినులు. ఈయన తమ ఆకాడెమీ ఆధ్వర్యాన దేశ విదేశాలలో రెండు వేలకు పైగా ప్రదర్శనలు ఇచ్చారు. ప్రస్తుతం తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన నాట్య విద్వాంసులుగా ఉన్నారు. ఈయన వయస్సు 52 సంవత్సరాలు. ధ్వన్యనుకరణ నిపుణుడు శ్రీ నేరెళ్ల వేణుమాధవ్. ఈయన ప్రపంచ యాత్ర చేసి తమ నైపుణ్యానికి ప్రశంసలు పొందారు. కళాప్రపూర్ణ బిరుదాంచితులు. ఒక పర్యాయం విధాన పరిషత్తు సభ్యులుగా ఉన్నారు. వయస్సు 49 సంవత్సరాలు.




## స్త్రీల కళాశాలకు స్వయం ప్రతిపత్తి :

ఇతర రాష్ట్రాలలో స్వయం ప్రతిపత్తిగల కళాశాలలు, విద్యా సంస్థలు చాలా ఉన్నాయి. మన రాష్ట్రంలో అలాటివి లేవు. కోఠీలోని మహిళా కళాశాలకు, కామారెడ్డిలోని ఆర్ట్—సైన్స్ కళాశాలకు యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ స్వయం ప్రతిపత్తి ఇవ్వడంతో ఆ కొరత రాష్ట్రానికి తీరింది. ఈ రెండు సంస్థలూ ఇంత వరకూ ఉస్మానియా విశ్వ విద్యాలయానికి అనుబంధ సంస్థలు. స్వయం ప్రతిపత్తి వల్ల ఈ రెండు సంస్థలూ, స్వకీయ పాఠ్యక్రమాన్ని, అధ్యయన కక్ష్యలను, పరీక్షల్లో మదింపు పద్ధతిని రూపొందించుకుంటాయి. మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉన్న పన్నెండు కళాశాలలకు, మదురై విశ్వవిద్యాలయంలో మూడు కళాశాలలకు, రాంచీ విశ్వవిద్యాలయంలోని ఒక సాంకేతిక సంస్థకు యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ ఇంత వరకు స్వయం ప్రతిపత్తి కల్పించింది.

## హిందూ మహాసముద్రంలో అమెరికా సైన్యాలు

సుప్రీం సోవియట్ పార్లమెంటు ఉపాధ్యక్షులు శ్రీ బాలియ జాక్స్ నియేవ్ ఆగస్టు 12న తేదీన సోవియట్ మిత్ర మండలి ఏర్పాటు చేసిన సమావేశంలో ప్రసంగిస్తూ, హిందూ మహా సముద్రంలోను, పర్షియా సింధు శాఖలోను అమెరికా నౌక, విమాన దళాలు పెరగడం ప్రతిఘటించాలని, అమెరికా సైన్యం ఉనికి ఆసియా దేశాల శాంతి భద్రతకు ప్రమాదకరమని హెచ్చరించారు. భారత, రష్యా మైత్రి దృఢంగా ఉండగలదని ఆయన నొక్కి చెప్పారు. ప్రపంచ శాంతి కోసం ఆయుధాల పోటీ ఆగిపోవడం అవసరమని, పశ్చిమాసియా సమస్యా పరిష్కారానికి విధిగా అంతర్జాతీయ సభ ఏర్పాటు కావాలని ఆయన సూచించారు. ఈ సమావేశం భారత రష్యా మైత్రీసంధి దశమ వార్షికోత్సవం సందర్భంగా జరిగింది.

## ఉపశ్రుతి :

కవిగారూ! మలేషియా, సింగపూర్‌లు చూసిన తర్వాత మన వూళ్లు ఎలా ఉన్నాయంటారు? — అడిగాను కవి మిత్రులు శ్రీ బోయి భీమన్నను. స్లమ్ముల్లాగ ఉన్నాయందామా? — అన్నారు భీమన్న. రాజును చూసిన కళ్లతో. . . అనే సామెతలాగుంది మీ మాట అన్నాను. అబ్బే! కవిగారి హృదయం స్లమ్ములను ఉద్ధరించడానికి పూనుకున్నట్లే దేశోద్ధరణకు పూనుకోవాలని — అన్నారు ఒక విమర్శకులు.★

# ఫాలాక్షుని డైరీ

## ఆస్తికోసం హత్య !

వీరప్పం పాళయం అనే వూరిలో రామాయి అనే ఆవిడ ముగ్గురు కొడుకులకూ ఆస్తి తగాదాలు వచ్చి అప్పుడప్పుడు పోట్లాడుకుంటూ ఉండేవారట. ఈ పోట్లాటలో పెద్ద కొడుకులిద్దరూ తల్లీ కలిసి, ఆఖరు కొడుకు మునియప్పన్‌తో పోట్లాడుతూండేవారుట. మొన్న ఒకటవ తేదీ రాత్రి ఏడు గంటలకు మళ్లీ చిరాపుగా పోట్లాట ఆరంభమైంది. అందులో తారకస్థాయికి చేరుకుని రామాయి, ఆమె పెద్ద కొడుకు కాళియప్ప కలిసి చటాల్న మునియప్పన్ను చెరోపక్క పట్టుకువేసరికి రెండో కొడుకు ముత్తు కొడవలితో చకచక మునియప్పన్ను యధాశక్తి నరికేశాడట. మునియప్పన్ భార్య అడ్డు వచ్చేసరికామెను తోసి పారేశాడట.

### నరరూప రాక్షసునికి మరణదండన !

అరబ్ దేశానికి చెందిన రస్—అల్—కైమా అనే నగరంలో ఓ గొర్రెల షాపులో పని చేసే 32ఏళ్ల అబ్దుల్ అజీజ మహమ్మద్ పార్కర్ అనే అతను పోయిన సంవత్సరం జూన్ 25వ తేదీన 5ఏళ్ల ఐసా అనే చిన్న పిల్లను బలాత్కరించి, అనక చంపేశాడట. మళ్లా ఈ ఏడు జూన్ 25వ తేదీన 7 ఏళ్ల లైలా అనే పిల్లను మానభంగం చేసి చంపేసి తప్పించుకు తిరుగాడుతున్నఅతన్ని పోలీసులు పట్టుకొన్నాక ముస్లిం కోర్టు విచారించి, అతనికి మరణ దండన విధించి ఆ దండన పుర వాసులందరి ఎదుట నెరవేరాలని,అంతకు ముందు 130 కొరడా దెబ్బలు కొట్టాలని తీర్పిచ్చిందట. మొన్న 29 తేదీన 70 కొరడా దెబ్బలు, 30వ తేదీన 60 కొరడా దెబ్బలూ కొట్టి 31వ తేదీన పదివేల మంది నగర ప్రజల ఎదుట చంపేశారట. ఈ మరణ దండన నెరవేర్చడం చూడ రమ్మని నగరంలో టముకు వేశారట. తీర్పులో అతని శిరస్సును శరీరం నుంచి వేరించి వేయాలని ఉన్నా తుపాకితో అతన్ని కాల్చి చంపారట— ఐక్య అరబ్‌లో ప్రజల ఎదుట మరణ దండన నెరవేరడం ఇదే మొదటిసారట.

### ఆత్మహత్యకి దారితీసిన అక్రమసంబంధాలు !

కుళ్లంపట్టి అనే గ్రామంలో 26 ఏళ్ల మరియప్పన్ అనే అతను వంటలకు వెళ్లేటప్పుడు అతనితో 22ఏళ్ల తమిళ్‌సెల్వి అనే ఆమె కూడా వెళ్లేదట. కూలీలా అవి తగాదానికి. ఆమెకు పెళ్లయినా, వారిద్దరి మధ్యలో ప్రేమ పుట్టి అది పెరిగిపెద్దదయ్యిందట. దాంతో వారిద్దరూ వేరే కాపురం పెట్టి ఓ ఏడాది జామ్మని గడిపేశారట. అనక తను రుచులు మరిగి సుఖ వ్యాధులు కొని తెచ్చుకున్నాడట. దాంతో తమిళ్ సెల్వి అతని ముఖం వాచేలా చివాట్లు పెట్టేసరికాతనికభిమానం దెబ్బ తిని ఉరి పోసుకుని చచ్చిపోయాడట.

## ఫొటో తెచ్చిన తంటా !

రోహతక్ జిల్లాకు చెందిన పై అనే గ్రామంలో జరుగుతూన్న ఓ పెళ్లిలో మగ పెళ్లివారు పెళ్లి కూతురిని ఫొటో తీయాలని సరదా పడేసరికి పెళ్లి కూతురు తరపు వారు టట్ వీల్లేదన్నారట. అది చిలికి గాలివానై కేశాకేశి, ముష్టాముష్టిగా మారిందట. తత్ఫలితంగా మగ పెళ్లివారు పెళ్లి కూతుర్ని తీసుకు వెళ్లకుండా తరలి వెళ్లిపోయారట.

### ముద్రా రాక్షసానికి బలైన విద్యార్థి !

హైదరాబాద్‌కు చెందిన ఓ పత్రిక ఆఫీసుకు ఫోన్ చేసి తాను ఇంటర్ మీడియెట్ పరీక్ష ప్రథమ తరగతిలో ప్యాసయినట్టు తెలుసుకుని వేణుగోపాల రెడ్డి అనే 19ఏళ్ల విద్యార్థి అనక తన నెంబరు ఏ పత్రికలోనూ కనపడకపోయేసరికి విషం త్రాగి ఆత్మహత్య చేసుకున్నాడట. ఇంతకూ అతను నిజంగానే ప్రథమ శ్రేణిలో ప్యాసయ్యాడట. కానీ ముద్రారాక్షసం వల్ల అతని నెంబరు వరంగల్లు జిల్లా లిస్టులో పడ్డదట— హతవిధీ!

### ఎడం కాలితో ఎస్.ఎస్.సి !

కొల్హాపూరు జిల్లాకు చెందిన గాంధిగంజ గ్రామంలో బాతడేల్‌బిలి అనే విద్యార్థి ఎడమ కాలితో పరీక్ష వ్రాసి ఎస్.ఎస్.సి. పరీక్ష ప్యాసయ్యాడట. అతనికి పుట్టుకనుంచీ రెండు చేతులూ లేవట. అతనికి ఆ రాష్ట్ర ముఖ్య మంత్రి పై చదువులకు గాను పదిహేనువేల రూపాయలు బహూకరించారట.

### మోసగత్తెని పట్టియిచ్చిన చీర !

సేలం కుంగిల్ల పట్టికి చెందిన 25 ఏళ్ల చంద్రన్ అనే అతని చెల్లెలు 15ఏళ్ల శాంతి అనే అమ్మాయి, 25 ఏళ్ల జానకి అనే మరో అమ్మాయి ఉన్నట్టుండి కనుపించకుండాపోయి మాయమై పోయారట. అన్నిచోట్లా వెతికి, పోలీసు రిపోర్టు ఇచ్చి ఇహ చేసేదేమీ లేక చంద్రన్ వూరుకున్నాడట. మొన్న ఒకటవ తేదీ చంద్రన్ 20 ఏళ్ల నీలమ్మ అనే ఆమె బట్టలుతుకుతూండడం చూసి ఆశ్చర్యంతో ఆగిపోయాడట. తన చెల్లెలు కనుపించకుండాపోయి నాడు కట్టుకున్న చీర ఆమె ఉతుకుతోందట. ఆ చీర ఎక్కడిదని అడిగితే పరమ శివం అనే ఆయన ఉతకడానికిచ్చాడన్నదట. చంద్రం ఇంకా విషయం విచారించేసరికి నీలమ్మ చుట్టుపక్కల ఆడపిల్లలను ఏమార్చి వ్యభిచార వృత్తిగ్గాను బొంబాయి పంపుతోందని తేలిందట. దాంతో ఆగ్రహం వచ్చిన చంద్రన్ నీలమ్మను మాయ మాటలతో పాండురంగన్ కొండకు తీసుకుపోయి అక్కడ ఆమె చేతులూ కాళ్లూ తాడుతో కట్టేసి, నోట్లో గుడ్డలు గూర్చి, నా చెల్లెల్ని వ్యభిచారం వాళ్లకు అమ్ముతావా అని జేబులోంచి కత్తెర తీసి, ఆమె జుట్టంతా కత్తిరించి చీర, జాకెట్టూ, బాడీ, లోపలి పరికిణి కూడా లాగేసి మప్పిలా నగ్నంగా ఏడ్చు ఆమెని ఆ బట్టలు తీసుకు చక్కా పోయాడట.






మా అన్ని బ్రాంచీలు మీరాకకై స్వాగతంపలుకుతున్నాయి

**జనత షూ కంపెని**

* * * * Ho. PHONE:NO.62832.

హనుమాన్‌పేట * విజయవాడ.3.




కావడానికి ఆయన పేరు కామేశ్వ రావేగాని ఆత్మీయులు ఆయన్ని 'తిమ్మిబమ్మయ్య' అని పిలుస్తారు. అంటే తిమ్మిని బమ్మిగా చేయగల సమర్థుడు— అని! నొప్పింపక, తానొవ్వక, పనుల్ని సునాయాసంగా సాధిం చడం ఆయన ప్రత్యేకత.

మీకు బదిలీ కావాలా? లేక బదిలీ ఆగి పోవాలా? సిమెంట్ పర్మిట్ కావాలా? వంట బ్రాహ్మడు కుదరలేదా? సంబంధాలు కుదర్చాలా? లేక చెడగొట్టాలా? పంచదార దొరక్క బాధ పడుతున్నారా? ఉద్యోగం లేక అలమటిస్తున్నారా?

మీ సమస్యలేవైనా కామేశ్వ రావుని కలుసు కోండి కాస్త ఖర్చుతో పని. ఆయన అడిగి నంత డబ్బు యిచ్చేసి మీరు నిశ్చింతగా వుండొచ్చు. వారం పది రోజుల్లో మీ సమస్యలు పరిష్కారం అయిపోతాయ్ లేకపోతే డబ్బు వాపస్...

కిట్టనివాళ్లు— కామేశ్వరావే సగం డబ్బు మింగేసా డంటారు. ఆయన్ని "మునలి నారదుడు" అని పిలుస్తారు!

ఎవరే మంటే నేం? కామేశ్వ రావు కార్య సాధకుడు— అని అందరూ ఒప్పుకుంటారు.

అంతటి కార్యసాధకుడూ సాధించలేనిది ఒక్కటే వుంది. సంతానం. అంతా అబ్బాయిలే కావాలని ఆయన ఆకాంక్ష. కాని ఆయన ఎంత ప్రయత్నించినా ఒక అబ్బాయి తరువాత వరుసగా ముగ్గురూ అమ్మాయిలే పుట్టేసారు!

అయితే తన లోపం లేకుండా పిల్లలకు రాజేష్, వందన, చందన, స్పందన అని బహు షోకైన పేర్లే పెట్టాడు— బొత్తిగా అప్పలకొండ, అచ్చమ్మ, పిచ్చమ్మ, బుచ్చమ్మ అని కాకుండా. అందుకా పిల్లలు తండ్రిని మనసారా అభినందిస్తారు

సంతానం ఒక వ్యవస్థ, మూడు మైనస్సులూ కావడంతో— మూడు మైనస్సులవల్ల కలిగే మొత్తం నష్టాన్ని ఒక ప్లస్సుతోనే పూడ్చుకోవాలని ఏ తండ్రిఅయినా ఆశించడం అసహజం కాదు కదా!

అది తెలుసుకోకుండా ఏమ్. బి. ఏ. ఫస్ట్‌క్లాసులో పాసైన పుత్ర రత్నం హడా వుడిగా ఒక అమ్మాయిని ప్రేమించేసాడు. ఆ అమ్మాయిది తమ కులమే. అక్కడికి కాస్త నయమే. కాని వాళ్లు కట్నం లెక్కన యిచ్చుకోగల స్థితిలో లేరు కట్నం కానివ్వండి లాంఛనాలు కానివ్వండి— పదివేలు; పెళ్లి ఖర్చులకు మరో ఐదు వేలు— అంతకు మించి మరో. పైసా ఖర్చు పెట్టలేనని బడ్జెట్ ప్రతిపాదించి సుందరంగా తొళ్లు చాపేసాడు అమ్మాయి తండ్రి సుందరరామయ్య. ఇవీ వేగులవాళ్లు సేకరించిన రహస్య సమాచారం. ఆ పదివేలతో తన ముగ్గురు కూతుళ్లకు కాదు కదా ఒక్క కూతురుకైనా పెళ్లి కొడుకును కాదు కదా అతగాడి కాలిని కూడా "కొనలేము" ఇదీ కామేశ్వ రావు సమస్య.

ఇంట్లో పుత్ర రత్నం— చూపులూ; పెళ్లి— అంటూ ఒకటే పోరు.

నొప్పింపక, తానొవ్వక పనులు సాధిం చడమే కామేశ్వరావు ప్రత్యేకత కదా! పెళ్లి చూపులకు బయలు దేరారు.

రూప మంచి రూపసి. రాజేష్ బుట్టలో పడ్డాడూ అంటే— పడడూ మరి!

మర్యాదలు బాగానే జరిపించాడు సుందర రామయ్య. కామేశ్వ రావు కూతుళ్లు మాత్రం "మాకున్నది ఒక్కడే అన్నయ్య— మా ముచ్చట్లు ఎవరు తీర్చుతారు? అన్నయ్యకు కట్నం యిచ్చినా మానినా, మాకు మాత్రం ఒక్కొక్కరికి రెండేసి వేలు ఆడపడుచు లాంఛనాల కింద యివ్వాలి" అని పట్టు పట్టారు.

"చూసారా బావగారూ! స్త్రీకి స్త్రీయే శత్రువు! నేను కట్నం గురించి పట్టించకో లేదుగాని మా అమ్మాయిలకు మాత్రం లాంఛ నాలు కావలసి వచ్చాయి." కూతుళ్ల వైపు మురిపెంగా చూస్తూ అన్నాడు కామేశ్వరావు.

"కాలేజీ డిబేటులో కట్నాలివ్వకూడ దని తీర్మానించాం గాని లాంఛనాలు వద్దన లేదు" అంది స్పందన గడుసుగా.

"కట్నానిదేముంది బావగారూ! సాంప్ర దాయం కావాలి. మీ సాంప్రదాయం మాకు నచ్చింది. అమ్మాయిని చిదిమి దీపం పెట్టు





# తిమ్మిని మించిన బమ్మి

కోవచ్చు! ఈ కరంట్ కోత రోజుల్లో దీపం లాంటి మీ అమ్మాయే మా యింటి కోడలు కావాలి!" అన్నాడు కామేశ్వరరావు గలగల నవ్వేస్తూ.

ప్రేమ వివాహాల పట్ల తండ్రులు– విలన్ లాంటి వాళ్ళని ఎన్నో కథల్లో చదివిన రాజేష్ ఆశ్చర్యపోయాడు – తన తండ్రి యింత సులభంగా ఒప్పుకున్నందుకు.

అప్పుడే ఆశ్చర్యంగా తల ఎత్తిన రూప వైపు చూసి – చూసావా నా ప్రతాపం? అన్నట్టు కళ్ళెగరేసాడు. కారు మబ్బులో కాంతి రేఖలా ఆమె కాటుక కళ్ళు తళ తళ్ళాడుతున్నాయి. హఠాత్తుగా లేచి మెరుపు తీగెలా లోనికి దూసుకుపోయింది. సుందరరామయ్య నోటమాట రావడంలేదు "ఇదంతా కలా? నిజమా?"

"బావగారూ! మీ అమ్మాయి జాతకం యిప్పించండి. మా పురోహితులు పేరిశాస్త్రి గారితో ముహూర్తం పెట్టిస్తా."

* * *

పేరిశాస్త్రి బాంబు పేల్చాడు "ఈ అమ్మాయికి పెళ్ళయిన ఏడాదిలోగా వైధవ్యం ప్రాప్తిస్తుంది!"

రాజేష్ గుండె గుభిల్లుమన్నది. నవయువకులు అందరి లానే అతనికి దేవుని మీద నమ్మకం లేదు కాని ఎస్. బి. ఏ. పాస్ కాగానే తిరుపతి వెళ్ళి గుండు గీయించు కున్నాడు. వారఫలాలంటే నమ్మకం లేదు. కాని అన్ని పత్రికల్లో వచ్చే వార, మాసఫలాలు చదువుతూ వుంటాడు. జాతకాలంటే నమ్మకంలేదు. అలాని తీసిపారెయ్యనూ లేడు.

"ఈ రోజుల్లో జాతకాల్ని ఎవరు పట్టించు కుంటున్నారు? నేనీ అమ్మాయినే చేసు కుంటా" అన్నాడు జంకుతూనే.

"అయితే అనుభవించు" అన్నాడు శాస్త్రి బెదిరింపుగా.

"ఏదో అడ్డదారి ఉండకపోదు. చెప్పి పుణ్యం కట్టుకోండి" ప్రతిమాలాడు కామేశ్వరరావు.

"పూర్వ కాలంలో అయితే ఏ మేకతోనో కత్తితోనో పెళ్ళి జరిపేవారు. ఈ రోజుల్లో అలా కుదరదు కదా... అయినా యింకో మార్గం వుంది" ఆశపెడుతూ ఆగాడు...

"చెప్పండి స్వామీ!" ఆత్రంగా అడిగాడు కామేశ్వరరావు.

"ఆ పిల్లను ముందు ఒక నపుంసకుడికిచ్చి పెళ్ళి చేయండి. వాడు చచ్చాక, మీ అబ్బాయి పెళ్ళి చేసుకోవచ్చు."

ఆముదం తాగినట్టు ముఖం పెట్టాడు రాజేష్. డిసెంట్రీ పట్టుకున్న వాడిలా ముఖం పెట్టాడు కామేశ్వర రావు.

"ఆ నపుంసక భర్త చావకపోతేనో?" సందేహం వ్యక్తం చేసాడు రాజేష్.

"నా జోస్యంమీద నమ్మకం లేకపోతే ఆ అమ్మాయిని నీవే కట్టుకుని అఘోరించు" కోపంగా భుజంమీది అంగవస్త్రాన్ని దులిపి యింట్లోకి వెళ్ళిపోయాడు శాస్త్రి.

తండ్రీ, కొడుకులు ఖిన్నులై యింటి ముఖం పట్టారు.

* * *

లోకం మీద కసి పెరిగిపోయింది రాజేష్‌కు. దేవదాసులా రెండు నెలలు ఈ వూరూ, ఆ వూరూ తిరిగాడు. గుండె కాస్త గట్టిపడ్డాక యింటికి వచ్చాడు.

ఇంట్లో తండ్రీ, పేరిశాస్త్రీ ఏవో సుదీర్ఘ మంతనాల్లో మునిగి వున్నారు వారి వైపు ఒక చూపు పారేసి తిన్నగా లోనికి వెళ్ళిపోయాడు రాజేష్.

"అదిగో అబ్బాయి వచ్చేసాడు! నే చెప్ప లేదుటండీ రెండు నెలల్లో అబ్బాయి వచ్చేస్తాడని! అంతా దైవ ఘటన! జాతక మహిమ నేను తెచ్చిన ఈ సంబంధం కూడా దైవనిర్ణయమే నండీ. గడ్డమూ అదీ గీయించి, అబ్బాయిని పెళ్ళి చూపులకు సిద్ధం చేయండి. రేపే మంచి రోజు!"

"అబ్బాయి పరిస్థితి చూసారా! మాసిన బట్టలూ, బరివి గడ్డమూ, పిచ్చివాడిలా వున్నాడు. ఇప్పుడు పెళ్ళి సంగతి ఎత్తితే మళ్ళీ పారిపోతాడు."

"అబ్బాయి ఎవడండీ పారిపోడానికీ, మానడానికీనూ? కళ్యాణ ఘడియ వచ్చింది. వచ్చేసాడు. ఇంక పారిపోడు. అంతా దైవ నిర్ణయం. వెళ్ళి చెప్పిచూడండి" అన్నాడు శాస్త్రి ధీమాగా.

ఇప్పుడే వచ్చిన కొడుకుతో అప్పుడే పెళ్ళి ప్రస్తావన ఏమిటి— అని సంశయిస్తూనే యింట్లోకి వెళ్ళి— చెల్లెళ్ళతోనూ, తల్లి

## తిమ్మిని మించిన బమ్మి

తోసూ ఈ రెండు నెలల తన అనుభవాలను సంతోషంగా ఏకరువు పెడుతున్న రాజేష్‌ను చూసి, ధైర్యం తెచ్చుకుని "రేపు పెళ్లి చూపులకు వెళ్ళాలిరా అబ్బాయీ" అన్నాడు కామేశ్వరరావు.

హఠాత్తుగా గంభీరంగా మారిపోయి "మీ యిష్టం నాన్నా" అనేసి బయటకు వెళ్ళిపోయాడు రాజేష్— గడ్డం గీయించుకోడానికి!

"ఏం చెప్పలేదుటండీ! అంతా దైవ నిర్ణయం... మీ కాబోయే వియ్యంకుడు మరెవరో కాదు. ఆ సుందరరామయ్య సోదరుడే... సీతారామయ్య. స్టేట్ బ్యాంక్ ఏజెంట్‌గా చేసి రిటైర్ అయ్యాడు యాభై వేలు కట్నం... ఆయన క్యాష్ చాదస్తం వుందండోయ్ నగలూ, డబ్బూ యింట్లో దాచకూడదు; బ్యాంకుల్లోనే దాచాలన్న సిద్ధాంతం అతనిది. ఆయన ఎవరికీ డబ్బు యివ్వడు. చెక్కులే యిస్తాడు చూడండీ... నా సంభావన కూడా చెక్కు ద్వారానే యిచ్చాడు .. ఎవరి పిచ్చి వారిది..."

* * *

పెళ్లి చూపులు ఆర్భాటంగానే జరిగాయి. పేరిశాస్త్రి చెప్పినట్లు సీతారామయ్య చెక్కుల మనిషి. సావా ఖర్చులకు మామూలు చెక్కులు. బహుమతికి గిఫ్ట్ చెక్కు. ప్రయాణానికి ట్రావెలర్స్ చెక్ - ఇదీ ఆయన పద్ధతి

"ఈ చెక్కులన్నీ ఎందుకండీ" అడిగాడు పేరిశాస్త్రి.

"నేను బ్యాంక్ మనిషిని. ప్రజలకు కూడా బ్యాంకింగ్ దృక్పథం అలవాటు కావాలి అంటాను. ఈ పద్ధతి వల్ల దొంగభయం వుండదు. విదేశాల్లో అన్నిటికీ చెక్కులే..."

అమ్మాయిని తీసుకొచ్చారు అమ్మలక్కలు. పేరు స్వరూప. "లక్ష రూపాయల చెక్కులా వుంది అమ్మాయి" అనుకున్నాడు కామేశ్వరరావు. ఈ అమ్మాయి నెక్కడో చూసినట్లు అనుమానం.

"మా అన్నగారి అమ్మాయి కూడా అచ్చు మా అమ్మాయిలానే వుంటుంది" వివరించాడు సీతారామయ్య.

బేరసారాలూ, ఆడపడుచు లాంఛనాలూ నిర్ణయం అయ్యాయి. పేరిశాస్త్రి సిద్ధంగా వున్నాడు కాబట్టి ముహూర్తం కూడా

## తిమ్మిని మించిన బమ్మి

నిర్ణయించేసారు. వెంటనే ముగ్గురమ్మాయిల పేర రెండేసి వేలకు చెక్కులు రాసి యిచ్చేశాడు సీతారామయ్య. కట్నం బాపతు అడ్వాన్సు నాలుగు వేలకు చెక్కు కామేశ్వరరావు కిచ్చేసాడు.

అతనికి సీతారామయ్య పట్ల వినలేని గౌరవం, గురి కుదిరాయి.

పెళ్ళిరోజు ...

రాత్రి తొమ్మిదిగంటల నలభై నిమిషాలకు పెళ్ళి. ఉదయమే కట్నం బాపతు మిగిలిన డబ్బుకి చెక్కు యిచ్చాడు సీతారామయ్య.

విడిదికి బ్యాంకు దూరమే అయినా వెళ్ళాడు కామేశ్వరరావు.

"సారీ! సంతకం టాలీ కాలేదు. కంగారుగా పెట్టినట్టున్నారు. చిన్నమొత్తం అయితే యిచ్చివేదుము. కాని పెద్ద మొత్తం కదా... మళ్ళా సరితకం పెట్టించుకు రండి" అన్నాడు అకౌంటెంట్.

"ఆ అకౌంట్‌లో అంత డబ్బు ఉందో లేదో ఒకసారి చూడండి"

లెడ్జర్ తెప్పించి చూసాడు అకౌంటెంట్.

"ఉంది సార్"

సంతృప్తిగా యింటికి వచ్చేసాడు కామేశ్వరరావు. తిరా వస్తే సీతారామయ్య లేడు. ఏదో పని మీద వెళ్ళాడు.

ఆయన వచ్చేక విషయం తెలిసి చాల నొచ్చుకున్నాడు. ఆ చెక్కు చింపేసి యింకోటి యిచ్చాడు. ఈసారి కామేశ్వరరావు వెళ్ళేసరికి బ్యాంక్ మూసేసారు.

పెళ్ళి పెళపెళ జరిగిపోయింది.

పెళ్ళికి సుందరరామయ్య దంపతులుకూడా వచ్చారు. "మనం వియ్యంకులంకాలేకపోయాం" విచారం వెలిబుచ్చాడు కామేశ్వరరావు.

"అంతా దైవేచ్ఛ" అనేసాడాయన.

మర్నాడుదయమే బ్యాంకుకు వెళ్ళాడు కామేశ్వరరావు. ప్రళయకాల రుద్రునిలా తిరిగి వచ్చాడు. చెక్కుని సీతారామయ్య మీదకు విసిరికొట్టి "చెక్కు మారలేదు" అన్నాడు.

"అవును. మారదని నాకు తెలుసు నిన్న మీరు బ్యాంకునుండి బయటకు వెళ్ళగానే డబ్బంతా తీసేసాను నేను" తాపీగా చెప్పాడు సీతారామయ్య.

"ఎంత మోసం!..." గొంతు మన్నాడు కామేశ్వరరావు.

"మోసం కాదు. సహాయం. మీ అబ్బాయి ఆడిన నాటకాన్ని విజయవంతం చేయడానికి నేను చేసిన సహాయం...!"

అయోమయంగా చూసాడు కామేశ్వరరావు "నాటకమా! మా అబ్బాయా!!"

మబ్బువీడిన సూర్యుడిలా బయటకు వచ్చాడు రాజేష్. "రూపతో నా పెళ్ళి మీకిష్టంలేదని మొదటినుండీ నాకు తెలుసు మీరు ఒక నాటకం ఆడి పేరిశాస్త్రితో అబద్ధం చెప్పించి సంబంధం తప్పించారు. తరువాత శాస్త్రిని కలుసుకుని పిలకపీకేస్తానని బెదిరిస్తే అసలు విషయం చెప్పేసాడు. నేను మరో నాటకం ఆడి ఆ అమ్మాయినే పెళ్ళి చేసుకున్నా! కన్యాదాతలు మారారుగాని అమ్మాయి మారలేదు".

కామేశ్వరరావు కోపం అవధులు దాటింది. "ఒకరి అమ్మాయిని తీసుకొచ్చి యింకొకరు ఎలా కన్యాదానం చేయగలరు? న్యాయశాస్త్రం ఒప్పుకోదు. నేను కోర్టు కెక్కుతా..."

మీరు అంతపని చేస్తారని నేను ముందే ఊహించాను. అందుకే సుందరరామయ్య దంపతులు తమ అమ్మాయిని సీతారామయ్య దంపతులకు రెండు నెలల క్రితమే శాస్త్రయుక్తంగా దత్తత యిచ్చారు. రుజువులూ సాక్ష్యాలూ కావాలా?"

దిగ్భ్రమగా నోటమాట రాక ఉండిపోయాడు కామేశ్వరరావు.

"తిమ్మిని బమ్మిగా మార్చగల తిమ్మయ్య బమ్మయ్య మీరైతే ఆ బమ్మిని తిమ్మిగా మార్చగల బమ్మి తిమ్మయ్యను నేను!" నవ్వేసాడు రాజేష్.

"అన్నయ్యా! నీవు తిమ్మిని మించిన బమ్మివి!" అంది వందన.

అందరూ పక పక నవ్వేసారు — కామేశ్వరరావు తప్ప.

## మనవి

### ఉత్తరాలు రాసేవారు

* పూర్తిగా తెలుగు లిపిలోనే రాయాలని,
* వారి పేరు, పూర్తి చిరునామా కూడా రాయాలనీ,

మనవి చేసుకుంటున్నాము.

— సంపాదకుడు

# వంటలు

## కరకజ్జాన్ని

కావలసిన వస్తువులు :— పెసరపప్పు గ్లాసెడు, చెక్కెర గ్లాసెడు, నెయ్యి 100 గ్రా, కిస్‌మిస్, జీడిపప్పు, ఏలకులు.

చేయుపద్ధతి :— పెసరపప్పును రెండు గంటలసేపు నీటిలో నానబెట్టి, నీరు వంచేసి మెత్తగా రుబ్బుకోవాలి. నీళ్ళు తగలకూడదు. వెడల్పాటి గిన్నెలో కొంచెం నెయ్యి వేసి జీడిపప్పు, కిస్‌మిస్ వేయించుకొని పక్కన ఉంచుకోవాలి. పెసరపప్పు రుబ్బగా వచ్చిన మిశ్రమానికి, చెక్కెరవేసి స్టౌ పై ఉంచి, అడుగంటకుండా కలియబెడుతూ ఉండాలి. గట్టిపడేముందు, నెయ్యి, యాలకపొడి, జీడిపప్పు వేసి బాగా కలిపి, పళ్ళెంలో వేసి ఆరాక ముక్కలు కోసుకోవాలి.

— పి. నాగలక్ష్మి

## పనసగింజలతో బోండా

కావలసిన వస్తువులు :— ఉప్పుడి బియ్యం 2 కప్పులు, మినప్పప్పు అరకప్పు, పనసగింజలు 10, ఉల్లిపాయ 1, పచ్చిమిర్చి 6, కొత్తిమిర, లవంగాలు 2, దాల్చినచెక్క, ఉప్పు.

తయారుచేయు విధానం :— పనసగింజలను ఉడకబెట్టుకొని, పైతోలు తీసివేయాలి. ఉప్పిడిబియ్యం, మినప్పప్పు రాళ్ళు లేకుండా శుభపరుచుకొని, గంటసేపు నీటిలో నానబెట్టాలి. తర్వాత ఉప్పిడిబియ్యం, మినప్పప్పు, పనసగింజలు, ఉప్పు, లవంగాలు, దాల్చినచెక్క వీటన్నిటిని రోటిలో వేసి నున్నగా, మెత్తగా రుబ్బుకుని, పాత్రలోకి తీసుకుని, అవసరమైతే, కొద్దిగా నీరు చేర్చి ఇడ్లీపిండిలా చేసుకోవాలి. ఉల్లిపాయ, పచ్చిమిర్చి, కొత్తిమిర ముక్కలు చేసి పాత్రలో వేసి బాగా కలపాలి. ఇప్పుడు బాణలిలో నూనె మరిగాక, పిండిని కొద్ది కొద్దిగా తీసి బాణలిలో వేయాలి. ఎర్రగా కాలిన తర్వాత తేసేయాలి. ఇవి కరకరలాడుతూ, ఎంతో రుచికరంగా ఉంటాయి.

— యం. పి. రాణి.

## బ్రెడ్ కట్లేట్

కావలసిన వస్తువులు :— బ్రెడ్ 1, బంగాళాదుంపలు 250 గ్రా, పచ్చిమిర్చి 8, ఉల్లిపాయ 1, లవంగాలు 2, శెనగపిండి 250 గ్రా, ఉప్పు.

తయారుచేయు విధానం :— బంగాళాదుంపలను ఉడకబెట్టుకుని, తోలు తీసివేసి ప్లేట్లో ఉంచుకోవాలి. ఉల్లిపాయలు, పచ్చిమిర్చి ముక్కలు చేసుకోవాలి. లవంగాలు మెత్తగా నూరుకోవాలి. ఇప్పుడు దుంపలు, ఉల్లిపాయ, పచ్చిమిర్చి ముక్కలు, నూరుకున్న లవంగాల ముద్ద, మెత్తని ఉప్పు వీటినంతటినీ వేసి మెత్తగా చేతితో కలుపుకోవాలి. బ్రెడ్‌ను మనకు నచ్చిన సైజులో కట్ చేసుకుని, ప్రతి బ్రెడ్ ముక్కకూ రెండు ప్రక్కలా మసాలా కలిపిన దుంపల ముద్దను వత్తాలి. శెనగపిండిలో ఉప్పు, నీరుపోసి జారుడుగా కలుపుకోవాలి. బాణలిలో నూనె కాగిన తర్వాత బంగాళాదుంపల ముద్దను వత్తిన బ్రెడ్ ముక్కలను శెనగపిండిలో ముంచి, బాణలిలో వేయాలి. వేడి, వేడిగా తింటే రుచిగా ఉంటుంది.

— కె. జి. హేమలత

"నాకు అదీ అవసరం లేదుగా" అన్నాడు దుర్గాదాస్ ఉదాసీనంగా.

"మొత్తం పాతిక రూపాయలు పోగయినాయి. ఈ డబ్బు ఎవరి పేరున డిపాజిట్ చేద్దాం?" అడిగాడు వినోదరావు

"ఇంకెవరి పేరునో ఎందుకు గురూ? నీ పేరునే వుంచు" అన్నాడు ఫరీద్.

వినోదరావు తల వూపాడు నవ్వి

* * *

"ఏమిటింత ఆలస్యం?" అడిగింది జయలక్ష్మి పూల పొట్లాం అందుకుంటూ.

"వయం; పతి ఫస్టా మాకు పండుగ రోజు సెకండ్ షో చూసి గాని ఇల్లు చేరం. ఆ అలవాటుకి ఇప్పుడు స్వస్తి చెప్పాం" అన్నాడు వినోదరావు.

జయలక్ష్మి నవ్వింది. బుగ్గలు రెండూ సొట్టలు పడ్డాయి. కళ్ళు అరమూతలయినాయి.

వినోదరావు గుండె వేగంగా కొట్టుకుంది. ముందుకు వంగబోయి బ్లాక్ అండ్ వైట్ గుర్తుకు వచ్చి బాత్‌రూమ్ వైపు పరుగెత్తాడు.

"ఏమిటి రాణీగారు ఉత్సాహంగా వున్నట్లున్నారు" అడిగాడు వినోదరావు జయలక్ష్మిని దగ్గరకు లాక్కుంటూ.

"ఏంలేదు..." అంది జయలక్ష్మి నవ్వి.

"ఉహూం నువ్వు ఏమీ లేదంటే నమ్మను. నువ్వేదో కోరుకోవాలనుకుంటున్నావు. అదేమిటో చెప్పెయ్!" అన్నాడు వినోదరావు వరాలిచ్చే విష్ణుమూర్తిలా శయనించి.

"మీకు తెలుసు. నాది ఒకే ఒక్క కోరిక నగలు-చీరెలు అడగను మిమ్మల్ని. మద్రాస్, హైదరాబాదు వెళ్ళాలి ఎన్టీఆర్ని, ఏ.ఎన్.ఆర్ని షూటింగ్‌లో చూడాలి. బొంబాయి వెళ్లాలి. ధర్మేంద్ర, సంజీవ్ కుమార్, అమితాబ్ బచ్చన్ లని షూటింగ్‌లో చూడాలి. అంతే...! నా కోర్కె తీర్చరూ?" అంది తమలపాకు చిలక వినోదరావు పెదవులకు అందిస్తూ.

ఆ చిలకతోపాటు చిలకల కొలికి చిగురాకు వేళ్ళు కొరికాడు సరస మెరిగిన వినోదరావు.

"అబ్బ! ఏమిటిది?"

నవ్వుతూ చేతులు బిగించాడు వినోదరావు.

'లైటు' అంది జయలక్ష్మి.

* * *

"అలా వున్నావేం?" అడిగారు నలుగురు మిత్రులు.

వినోదరావు మొహం పాడైపోయిన ట్యూబ్ లైట్‌లా వున్నది. "ఏం లేదు బ్రదర్! జయని పుట్టింటికి పంపక తప్పేట్టు లేదు" అన్నాడు నీరసంగా.

"ఎందుకని?" అడిగారు నలుగురూ ఒకరి నొకరు చూసుకుని.

"డాక్టర్ థర్ మంత్ అనీ, బాగా వీక్‌గా ఉందనీ పనులూ అవీ చేయవద్దని రెస్ట్ తీసుకోమని సలహా ఇచ్చి ఓ లిస్ట్ టానిక్స్ వ్రాసి ఇచ్చిందట! జయలక్ష్మిని ఇక్కడే కూర్చోబెట్టి చేసేవారు ఎవరు? మా బామ్మ అసలే ముసల్ది, పైగా జబ్బు మనిషి. ఏం చేస్తుంది? జయలక్ష్మిని పుట్టింటికి పంపక తప్పేట్లు లేదు..." అన్నాడు వినోదరావు నీరసంగా.

"అదేమిటి? నువ్వు జాగ్రత్త పడినట్లున్నావ్ గదా?" అడిగాడు నిరంజన్ అనుమానంగా.

"ఎక్కడో పొరబాటు జరిగి వుండాలి! ఎందుకైనా మంచిది, మీరు ఇంకా జాగ్రత్త పడండి. కన్సల్ట్ ఎనీ ఫామిలీ ప్లానింగ్ డాక్టర్!" అన్నాడు వినోదరావు

నలుగురూ మాట్లాడలేదు. వినోదరావు అందరి వైపు చూశాడు.

"నన్నేం చేయమంటారు?" అని అడిగాడు.

"నీకేం సలహా ఇవ్వగలం? నువ్వే మాకు గురువ్వి! సరే జరిగిందేదో జరిగిపోయింది, ఆవిడ్ని పుట్టింటికి పంపెయ్! ఆదివారాలు వెళ్ళు. ఇప్పటివరకు మనం దాచింది ఎలాగో వుండనే వున్నది. ఇకముందు అలాగే రెగ్యులర్‌గా దాచుదాం. పైన పదో పరకో నువ్వు ఏక్కువదామ మన కో-ఆపరేటివ్ బ్యాంక్ లోని బ్యాలెన్స్‌కి నువ్వే బోణీకొట్టు! అప్పైన ఏదైనా సహాయం కావల్సివస్తే మేమందరం వుండనే వున్నాం!" అన్నాడు చిన్నారావు.

"థాంక్స్.. థాంక్స్..." అన్నాడు వినోదరావు. ఆ పైన వారం వారం అతను అత్తవారి వూరు వెళ్ళివస్తూనే వున్నాడు. ఆరు నెలలు గడిచిపోయేయి. ఆ నెల చందాలు కూడా బ్యాంక్‌లో చేరాయి.

"ఫ్రండ్స్! మీ అందరి అనుమతితో నేను బ్యాంక్‌లో నుంచి వెయ్యిరూపాయలు విత్‌డ్రా చేసుకుంటున్నాను. ఈ నెలలో ఎప్పుడో ఒకప్పుడు జయలక్ష్మిని పురిటికి తీసుకురావల్సి వస్తుంది. నా జీతంలో కూడా మరో మూడువందలు - కొన్ని బాకీలు ఇవ్వటం ఆపి, జాగ్రత్త చేస్తున్నారు" అన్నాడు వినోదరావు.

"గుడ్! పొసిడ్! విష్ యూ బెస్టాఫ్ లక్! భావి భారత ప్రధాని కాగల కొడుకు పుట్టా



# పంచపాండవులు — ఫామిలీ ప్లానింగ్

లని ఆశిస్తున్నాం; ఆశీర్వదిస్తున్నాం ..." అన్నారందరూ.

మళ్ళీ థాంక్స్ చెప్పాడు వినోదరావు ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ. ఆ తరువాత — రెండు రోజుల తరువాత మామగారి నుంచీ ఉత్తరం వచ్చిందని, వెడుతున్నాను అని చెప్పాడు వినోదరావు మినిమమ్ బ్యాలెన్స్ చూపుతున్న బ్యాంక్ పాస్ బుక్ చిన్నారావుకి అందించాడు.

* * *

ఐదు రోజుల చిన్నారావు పేర కవరొకటి వచ్చింది. అది వినోదరావు వ్రాసింది.

"మై డియర్ ఫ్రెండ్స్!

క్షమించాలి! నే నిప్పుడు బొంబాయికి ట్రైన్ ఎక్కుతూ ఈ కవరు మీకు పోస్ట్ చేస్తున్నాను. చేరేసరికి మేము బొంబాయిలో వుంటాము.

నా ప్రియమైన మిత్రులారా! మీకు ద్రోహం చేశాను; మోసం చేశాను క్షమించాలి మీరు. నా భార్య — నా ప్రాణం జయలక్ష్మి నగలు, చీరలూ కోరలేదు నన్ను. ఒక్కటే కోరిక బొంబాయి, మద్రాస్, హైదరాబాదు లలో తన అభిమాన నటుల చిత్రాలు షూటింగ్స్ చూడాలని కోరింది. ఆ కోరిక వీలాగైనా తీర్చాలనుకున్నాను. అంతే! పథకం వేశాను, అదే మన పంచపాండవుల ఫామిలీ ప్లానింగ్ కో-ఆపరేటివ్ బ్యాంక్ స్కీమ్!

నా భార్య కడుపుతో లేదు. అలా నాటక మాడాను. ఆమె ఇక్కడే వుంటే రహస్యం బయట పడుతుందని భయంతో పుట్టింటికి పంపేశాను. వారం వారం నేనే వెళ్లేవాడిని.

మరో రెండేళ్ళ వరకు పిల్లల్ని కనే ఆలోచన లేదు మాకు... నేను వాడుకుంటున్న ఈ వెయ్యి రూపాయలు త్వరలో నెలకి కొంత చొప్పున తిరిగి మన కో-ఆపరేటివ్ బ్యాంక్‌లో డిపాజిట్ చేసేస్తాను.

బొంబాయి నుంచీ మీకు చక్కని బహుమతులు తెస్తాను.

మీ నలుగురూ నన్ను క్షమించగలరని విశ్వసిస్తాను.

మిత్రుడు,
వినోదరావు"

వినాయక చవితి శుభాకాంక్షలతో

# SRFC శ్రీరామా ఫైనాన్స్ కార్పొరేషన్

## మోటార్ & జనరల్ ఫైనాన్షియర్స్

పోస్ట్ బాక్స్ నెం.6 **బొబ్బిలి-532 558.**

విజయనగరం జిల్లా

ఫోన్: 345 గ్రామ్స్: ఫైనాన్స్

ఇతర ఆఫీసులు:

పోస్ట్ బాక్స్ నెం. 2020
30-15-35 డాబాగార్డెన్స్
విశాఖపట్నం-530 020
ఫోన్: 64466 గ్రామ్స్: ఫైనాన్స్
టెలెక్స్: 0495-330

మేజర్ పి.కె.దాస్ బిల్డింగ్స్
నయా చౌక్
కటక్-753 010 (ఒరిస్సా)
ఫోన్: 20752 గ్రామ్స్: ఫైనాన్స్

40, రామానుజం స్ట్రీట్, టి.నగర్
మద్రాస్-600 017
ఫోన్: 446746 గ్రామ్స్: రామ్ ఫిన్

**సులభమైన షరతులపై**
**కమర్షియల్ వాహనములకు**
**ఋణములు యివ్వబడును.**
మరియు **ఆకర్షణీయమైన రేట్లపై**
**ఫిక్సెడ్ డిపాజిట్లు అంగీకరించబడును**

**సి.వి. సీతారామ స్వామి**
మేనేజింగ్ పార్టనర్

PRASAAD PUBS







# ధర్మపథం — బులుసు వేంకట రమణయ్య

## భక్తి – కరుణ

కర్మ – జ్ఞాన – భక్తి మార్గాలలో భక్తి సులభ సాధ్యమైనది. భగవంతునియందు తన్మయతను కలిగించే ప్రగాఢమైన ప్రేమనే భక్తి అంటారు. భక్తునిమనస్సు ఎల్లప్పుడూ మెత్తనై ఉంటుంది. కఠినంగా ఉండదు. ఉండకూడదు. గుడిలోగాని, గృహంలోగాని భక్తితో భగవంతుణ్ని స్తుతిస్తూ, కీర్తనలు పాడుతూ పరవశత్వం పొందుతూ ఉన్నా, ఇంటికివచ్చిన అతిథికి శక్తి ననుసరించి ఆతిథ్యం యివ్వక, బిచ్చగానికి బిచ్చం పెట్టక తిరస్కరిస్తే, అట్టి భక్తివల్ల ప్రయోజనం లేదు. భక్తిని అంటి పెట్టుకుని కరుణకూడా ఉండాలి.

కరుణా హృదయుడైన కేశవదాసు అనే ఒక భక్తుడు ఉండేవాడు. అతడు దరిద్రుడు. ఒకపూట తిండిచాలు. అందు కోసం ఏదోపని కొంచెంసేపుచేసి జీవనం గడిపేవాడు. తరచుగా – తన నివాసానికి కొంతదూరంలో ఉన్న క్షేత్రానికి పోయి అక్కడి శ్రీరామచంద్రుని దర్శించి పరమానంద భరితుడు అయ్యేవాడు.

ఒకప్పుడు అతడు దేవదర్శనానికి పోతూ ఉండగా దారిలో ఒకచోట వలపన్ని ఇద్దరు ముగ్గురు మనుష్యులు చిలుకలు, గోరువంకలు, బంగారుపిచ్చుకలు మొదలైన అందమైన పక్షులను పట్టుకోవడం చూచాడు. వాటి ఆర్తధ్వని అతని మనస్సును కరిగించింది. "నాయనలారా! అవి చాలా బాధపడి దుఃఖిస్తున్నాయి. వాటిని విడిచిపెట్టండి. అవి మనలాంటి ప్రాణులే! మనల్ని ఎవరైనా బాధపెడితే ఎంతకష్టంగా ఉంటుందో ఆలోచించండి" అన్నాడు. వాళ్ళు "వీటిని మేం చంపము. అమ్ముకొని డబ్బు సంపాదించుకుంటాము" అన్నారు. "అయితే, నాదగ్గరవున్న డబ్బంతా ఇస్తాను. వాటిని విడిచిపెట్టండి" అని తనవద్దనున్న పైకం యిచ్చి వాటిని విడిపించాడు. అవి కలకల ధ్వనులతో ఎగిరిపోతూవుంటే ఎంతో ఆనందించాడు.

అతడు ఆ క్షేత్రానికిపోయి దైవదర్శనం చేసుకున్న తర్వాత - ఇతడు గొప్పభక్తుడనే సంగతి ఎరిగిన ధర్మకర్తలు సమృద్ధిగా ప్రసాదాన్ని ఇప్పించారు. తక్కిన వారికి ప్రసాదం దొరకడం దుర్లభమయింది. కొందరు ఇతని దగ్గరకువచ్చి ప్రసాదం కొంచెం ఇమ్మన్నారు. అడిగినవారి కందరికీ కొంచెం కొంచెంఇచ్చినా అంతా అయిపోయింది. అతనికి కొంచెమైనా మిగలలేదు. క్రిందటి దినం ఉపవాసంతో ఉన్న అతని ఆకలి ఆకలిగానే ఉండిపోయింది. దానికి అతడు బాధపడలేదు. కొందరికి కొంతవరకయినా తృప్తిని కలిగించినందులకు ఎంతో సంతోషించాడు.

ఉత్తమ భక్తునికి భక్తికంటె కరుణయే గొప్పది.



# National నోవీనో స్పెషల్




# జపాన్ తయారీ అంత మంచి ఇండియన్ బ్యాటరీ.

సహజమే! ప్రపంచ ప్రసిద్ధమైన నేషనల్, జపాన్ వారి సహకారంతో ఇండియాలోని అత్యాధునికమైన ఒక ఫ్యాక్టరీలో తయారైంది మరి, నోవీనో స్పెషల్! నోవీనో ఫ్యాక్టరీలో, కచ్చితమైన నాణ్యత తెప్పించడానికి, ప్రతి ఉత్పాదనా దశలోనూ ఎంతో జాగ్రత్త తీసుకోబడుతుంది. అందుకే ఎక్కువ వెలుతురూ, ఎక్కువ మన్నికా కలిగి, మోసపోవడానికి వీలులేని బ్యాటరీ మీకు దొరుకుతుంది. అదే, జపాన్ సాంకేతిక జ్ఞానం, ఇండియా నైపుణ్యంల మేలు కలయిక! అదే నోవీనో స్పెషల్‌ను అంత విశిష్టంగా రూపొందించేది!




రాత్రిని పగలుగా
మార్చే బ్యాటరీ.

**నోవీనో**
మరింతమేలైన బ్యాటరీ

లఖన్‌పాల్ నేషనల్ లిమిటెడ్
బరోడా, గుజరాత్.
నేషనల్, జపాన్‌వారి సహకారంతో
ఒక ఉమ్మడి సంస్థ.

Sista's LNL-374/81 TEL






# ఉత్తరాలు

(6 వ పేజీ తరువాయి)

## కథలు

21—8—81వ తేది 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక, చదివాను. ప్రచురించిన కథలు చాలా బావున్నాయి. కథల ప్రచురణ విషయంలో మీరు చూపుతున్న శ్రద్ధకు మా జోహార్లు. ప్రతివారం మీరు ప్రచురిస్తున్న వారఫలం మాకు చాలా ఉపయోగపడుతూంది. ఎందుకంటే మీరు ఎలా రాస్తున్నారో అలాగే జరుగుతున్నాయి సంఘటనలు.

అనితాసాకరే [ఆదోని]

* * *

21.8.81 నాటి సంచికలోని 'మార్పుల కర్ఖానాలో' చాలా బాగా వుంది. ప్లాట్ మామూలుగా వున్నా సంభాషణ చాలా బాగా వుంది. మొత్తానికి ఈ సంచికలోని కార్టూనులు బాగున్నాయి.

కె. వి. నరసింహం [మద్రాసు]

* * *

21.8.81 వ తేదీన వారపత్రికలో ప్రచురించిన బలహీనత కథ చాలా బావుంది. పిల్లలు కోరినవి ప్రతి కోరికలో ఎంత ఉపయోగమున్నదో కూడా యోచించాలి. తన తాహతుకు మించిన ధ్యైతే విసర్జించాలని తెలిపే కథ. రచయితకి మా కృతజ్ఞతలు.

ఎ.వి. జి. కృష్ణమూర్తి [జగ్గయ్యపేట]

* * *

శోభన్‌బాబు, రతి ముఖచిత్రంతో వెలువడిన మీ (మా) పత్రిక ఆకర్షణీయంగా ఉంది. కొండముది రుక్మిణిదేవిగారి "ఎదురుచూపు" పెద్దకథ ప్రారంభంలో ఎంతో ఆసక్తిని కలిగించినది. ప్రచురించినమీకు. రచయితకి, మా ధన్యవాదాలు.

కడియాల సురేష్‌బాబు, భార్గవీదేవి
(కొత్త మంగళగిరి)

## కార్టూన్లు

స్వాతంత్ర దినోత్సవ సందర్భంగా వెలువడిన 21.8.81 నాటి పత్రిక ముఖచిత్రం అర్థవంతంగానూ, అందంగానూ ఉంది. లోకంపోకడ, ఊమెన్ గారి కార్టూన్లు వేడి వేడి మిరపబజ్జీల్లా వున్నాయి. చురకలు తగిలిస్తున్నాయి. ఈ వారం ఉత్తరాల కోసం చాలా ఎక్కువ స్థలం కేటాయించినందుకు పాఠక లోకం ఆనందించింది. ఇకపోతే సీట్లకోసం పాట్లు కార్టూన్లు మాత్రం ఏమంత బాగాలేవు. ఎబ్బెట్టుగా వున్నాయి.

మటికాన ప్రకాష్ (విజయనగరం)


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

# బాక్సాఫీస్ హిట్...?

బాక్సాఫీస్ హిట్ సినిమాలు తీయటంలో రికార్డులు పగల గొట్టిన పెద్ద మనిషిని అరువు తెచ్చుకున్నారా కంపెనీ వాళ్లు...హీరోయిన్ పదకొండేళ్లపిల్ల. అయితేనేంగాక...ఆ మాత్రం పిల్లకు సెక్సప్పీల్ ఉండదా...? గ్లామర్ ఉండదా...? ఎత్తు పల్లాలుండవా...? పోస్టర్లు చూసి జనం థియేటర్ దగ్గరికి పరుగెత్తుకు రారా...? అని దబాయించి అద్భుతమైన కళాఖండం నిర్మాణానికి పూనుకున్నాడాయన.

ఆ తర్వాత ఏం జరిగింది. ఆ సినిమాని ఆయన ఎలా 'బాక్సాఫీస్ హిట్'గా మలిచాడు? ఆ తరువాతి కథ వెండి తెర మీద గాక 'విపుల' సెప్టెంబరు సంచికలో ఆశాభంజ్ దేవ్ కథ "బాక్సాఫీస్ హిట్" చదివి తెలుసుకోండి.

ఈ కథతో పాటు మరెన్నో భాషల వైవిధ్యంగల కథలను జాను తెలుగులో అందజేస్తుంది విపుల. అదనంగా నవ్వించే జోకులు, కార్టూన్లు, విచిత్రవిశ్వ సరదా విశేషాలు, పంచ వర్ణ చిత్రాలు... 'విపుల' మాత్రమే అందజేసే విశిష్టతలు

## విపుల

**132 పేజీలు** **రెండు రూపాయలే**

'విపుల'
పాఠకులకు అందజేసే
వివిధ భాషల
కథానికా
సుమ
సౌరభంలోని
వైవిధ్యం అనంతం!
ప్రపంచంలోని
అనేక భాషల నుండి
సేకరించిన
విశిష్ట కథానికలకు
నెలవు
'విపుల'
కథా ప్రియులకు
షడ్రసోపేత
విందు
'విపుల'





'విపుల'లోని
అనేక
భాషల
విశిష్ట కథలు
మిమ్మల్ని
ఆసక్తితో
చదివింప జేస్తాయి.

తెలుగులో
మరే పత్రికా
అందించని
వైవిధ్యం గల
విభిన్న భాషల
విశిష్ట కథలకు
ఏకైక వేదిక
'విపుల'